సంపాదకులు

విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాది గౌతమరావు

# జయంతి

18

సంపుటి 2 సంచిక 6 మే '60

ఓహాద్రి వేంకటావధాని

రాపూరి ప్రసన్న సత్యనారాయణ

పల్లంపాటి వెంకటసుబ్బయ్య

కలువకొలను సదానంద

శతక్రియవు

సుప్రసన్న

సుధాకరరావు

విశ్వనాథ సత్యనారాయణ

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాస పత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు....

కార్యాలయము :

౩౧౬, సుల్తాన్ బజార్

హైదరాబాద్.

---

PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.

R. C. No. 973 M 4/58.    Dated 8-6-59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and Public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,

*For Director of Public Instruction.*

# జయంతి
## 18

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః



సంపాదకులు

విశ్వనాథ సత్యనారాయణ

జువ్వాడి గౌతమరావు

కార్యాలయము

ఉస్మాన్‌పురా, కరీంనగరము

సంవత్సర చందా రు. 8=00

విడిప్రతి 0=75 న.పై.

# నిత్యజాగృతి

సుధాకరరావు.

నర నరములలోపల తర తరములుగ ర
హస్యమీకృత వాసనా వ్యసనగుణము
లంత రంతరములయందు నణచబడియు
తలలు పైకెత్తి మాటికి నిలువబడును.

ఎదికావలె, ఎదివలదని
ఇదికావలె, ఇదియువలదనీ నిశ్చితియుం
డదు, ఎదియును ఇదియును
మొదలు చివళ్లుగ సర్వమును గావలెనాన్

ఎట్టి నిర్దిష్టతయు లేని ఎట్టి పరిధి
లేని, లేనట్టి వలయుట ఏమిటిద్ది ?
ఏది అనుభూతమో దాననే చరించు
నట్టిబుద్ధికి ఇది చిత్రమైన రీతి.

నాలోలో గుడుసుళ్లుగ
నై, లౌకిక సర్వవిషయతాధిష్ఠాత్రి
హేలామృదు హాసరుచి
శ్రీలాస్యము నిత్య తృష్ణ చిందించునెదన్

అసలు నేనన్న యట్టి దనంతరమ్మ
వాంఛ పూర్వమ్ముగా జన్మపరిణమించి
యుండు కాబోలు, మూసలో నొదిగి ఇట్లు
సావయవమయి ఇది నిత్యజాగృతమ్మ

# సంపాదకీయము

గతము, హితము ఇవి రెండు ద్వంద్వాలు. అందుచేత తెలుగు భాషలో రెండును జంటగా వాడబడుచున్నవి. అట్లు వాడబడుటకు వాని రూపము సహకారి యగుచున్నది. కొందరు నవీన భావప్రేరితులయిన కవులు వీని రెంటిని పూడ్చిపెట్ట వలసిన విషయములుగా వ్రాయుచున్నారు. ఒక కవి గతమును ముసలియావును కట్టి పాలుపిండుకొని వదలివేసితినని వ్రాసినాడు. ముసలియావు పాలిచ్చునా? వయస్సులోనున్న యావయినచో దానిని కట్టివేయుట, బందము వేయుట, దూడను కొలిపి చేపించుట, మొదలయిన పనులు జరుగవచ్చును. అది పాలీయవచ్చును. ముసలి యావును కట్టివేయుట యేమి? అది పాలిచ్చుట ఏమి? అది ఎట్టి పాలిచ్చును? ఎన్ని పాలిచ్చును. ఇందు రెండు దోషములు కలవు. ఒకటి గతమును గూర్చిచేసిన యూహాయందే దోషముకలదు. అది సిద్ధాంత విషయము. రెండవది దాని నావుతో పోల్చుట సాదృశ్యములేని యలంకారము. గతము పూర్తిగా పరిత్యజించ వలసినదన్న సిద్ధాంత మెచ్చటిది? ఇది సామ్యవాదుల హాళాహాళిలోని భాగము. గతము గతమైపోయినదని వర్తమానమును బాపుకొందమని. ఒక వృక్షమును తీసుకొని అది మొక్కయిన నాటినుండి వృక్షమైన నాటివరకు కాలపరిమాణముతో జూచినచో పండి కాయలుకాయుచున్న మామిడిచెట్టునకు కడచిన నాలుగైదేండ్లు గతము. ఆ గతమునందు మాకభిమానము లేదు. నేడు కాయుచున్న కాయలయందే మాకభిమానమున్నచో నంగడిలో కాయలుకొని తినెడివాడవ వచ్చును. తోటమాలి యనలేదు. మామిడితోట వేసినాడు. నాలుగైదేండ్లకుగాని కాపుపట్టదు. ఈ నాలుగైదేండ్లు దున్నుట, నీరుపెట్టుట పై పరామరిక చూచుట, కాపుపట్టిన తరువాత కూడ రెండుమూడేండ్లు రాలుకాపు పట్టును. అప్పుడును దానిమీదవచ్చు ఫలసాయము మిక్కిలిగా నుండదు. ముదురుకాపు బయలుదేరిన తరువాత తోట కొన్నియేండ్లు కాచును. తరువాత చెట్లు ముసలివగును. కాపుడిగిపోవును. తోట వ్యర్థమగును. యజమానికి మాత్రము తొలుత తాను పెట్టిన వ్యయము కాపు మొదలుపెట్టిన తరువాత గుంజుకొనవలసి వచ్చును. తోట కాపు మొదలుపెట్టిన దన్నంతనే వచ్చెడి సంతోషము లేదు, మామిడిచెట్టు బంగినపల్లియో, ఇమాందీనో, జహంగీరో రసమో, కావచ్చును. రెండు నెలలు పూతపట్టినది మొదలు కాయదింపి కాపు వేసెడివరకు యజమాని దానిని రక్షించుకొనుచుండ వలయును. పరమేశ్వరు డనుగ్రహించ వలయును. రెండు పెద్దగాలులు విసరినచో కాయలు మరి నెలలో పెద్దవగుననగా రాలిపోవును. మరువాడు వాని నంగడిలో మిక్కిలి చౌకగా నమ్ముకొనుట తప్ప మరొకమార్గము లేదు.

ఒక్కొక్కకాయ నాలుగణాలు చెచ్చినది అణాకు పన్నెండుగా నమ్మవలసి వచ్చును. వర్తమానము వర్తమానమనుకొనుటయే గాని యా వర్తమానము కడచి కడతేరుటకు ప్రతి క్షణము దైవము నున్నించ వలయును. పౌరుషము కొరవడరాదు.

నిజముగా గతమన్న మాట కర్థము లేదు. ప్రస్తుత నిమిషమునందు పూర్వనిమిషము గతము. నేటికి నిన్న గతము. ఇది గత మిది గతము కాదని నిర్ణయించుటకు గూడ నావకాశము లేదు. ఒక రెండు వ్యవహారములున్నవి. ఒకటి పదియేండ్లక్రింద మొదలుపెట్టి నది అది ఇప్పటివరకు తేలలేదు. మరియొక వ్యవహారము నాల్గేండ్లక్రింద మొదలుపెట్టి నది. ఏడాదిక్రింద పర్యవసానము పొందినది. నాల్గేండ్లక్రింద మొదలుపెట్టిన వ్యవహారము గతమై పోయినది. పది ఏండ్లక్రింద మొదలు పెట్టినది వర్తమానములో నున్నది. కనుక గతముగాని వర్తమానముగాని వ్యవహారాపేక్షయా గత వ్యవహారము లగుచున్నవి గాని కాలాపేక్షయా కాదు. ఆధునిక కవులును యెవ్వరినుండి వీరీ తందాన నేర్చుకొనిరో వారు గాని గతమన్న మాట నీ యర్థములోనే వాడుచుండ వలయును. వ్యవహారాపేక్షయా యనగా లౌకికాపేక్షయని యర్థము. లాభాపేక్షయనికూడ నర్థము చెప్పవచ్చును. నాల్గేండ్లక్రింద ప్రారంభింపబడి ఏడాదిక్రింద పర్యవసించిన వ్యవహారముమూలమ వచ్చిన ధనముతో పది ఏండ్లక్రింద ప్రారంభింపబడి నేటివరకు తేలనివ్యవహారము గృహస్థు సాగించు కొనుచుండును. అతడు దానిని గతమని నిరాకరించునా? నిరాకరించినచో నేమన వలయునో తెలియదు.

రామమోహనరాయలతో మొదలుపెట్టబడియొక సంఘసంస్కారభావము ప్రచలితమైనది. కేశవ చంద్రసేన ప్రభృతులు దానిని పోషించినారు. అది తెలుగు దేశమునను వ్యాపించినది. వీరేశలింగముగారు దానికి నిచట పితామహులవంటి వైనారు. నాయకుడుగారు గొప్ప ప్రాపకమైరి. అనుయాయులెందరో కలరు. ఈభావము వర్తమానమని రమణమహర్షి, రామకృష్ణ పరమహంస మొదలగు మహానుభావులచేత సముద్ధరింపబడి యనాదిగా వచ్చుచున్న యొక భావము గతమైన దానిలోని విషయమని చెప్పుటకు వీలు న్నదా? ఇది సంఘసంస్కార విషయము. అది యాధ్యాత్మిక విషయము. రెంటికిని పోలిక లేదనవచ్చును. సంఘసంస్కార భావముతో సహస్థితమై యాసంస్కారము కూడ దనెడువారుకూడ నెప్పుడు నున్నారు. వలయునన్న వారిది వర్తమాన స్థితియు, వలదన్న వారిది గతస్థితియు నగునా? ఆధునికులయిన కొందరు కొన్నిమాటలను తీసికొని తదర్థ విచారణ చేయకుండ ప్రచారదృష్టితో పల్లటీలుకొట్టుటగాని మరియొక్కటిగా గన్పించదు.

మతమన్నది యున్నది. ఈ మతమును నిందించుట బరిపాటియై పోయినది. ఇంటి

లో మతము లేని వాడెవ్వడును లేడు. ముసలితల్లికి సంతోషపెట్టుటకు ఏమైన తనవలన తనకాస్తి వచ్చినదో యా మేనత్తను తృప్తి పరచుటకు మతమునకు సంబంధించిన కార్యములు చేయుచునే యున్నారు. మొదటివాడు తల్లియందలి గౌరవముచేత చేయుచున్నాడు. రెండవవాడాస్తి యందలి యాశచేత చేయుచున్నాడు. శుభాశుభములయందు మతము వచ్చి పరిహరింపరానిదిగా గనిపించుచున్నది. ఆ మతమన్నది యభిప్రాయములుగా నాచారములుగా నిరుగుపొరుగు వారితోడి సంబంధముగా బహువిధములుగా నున్నది. ఒక యంశమునందు నిరాకరించినను మరియొక యంశమునందు బలవంతముగా నుండును.

మన దేశములో మతము చిత్రముగా నున్నది. వివాహము మతములో భాగము. జనన మరణములు మతములో భాగము. గృహప్రవేశము మతములో భాగము. ప్రయాణమై ఏ యూరికో పోవుట మతములో భాగము. సంఘమునకు మతము యొక్క స్వరూపమే యిది. దానినుండి ఎవ్వడును తప్పించుకొని పోలేడు. ఒక విధముగా వ్యాఖ్యానము చేయబడినదానికి మరియొక విధముగా వ్యాఖ్యానము చేయుటయే గాని దానినుండి యెవడు తప్పించుకొని పోవడు. మంగళసూత్రమును తొలగించి పూలదండతో నడిపినచో పెండ్లి పెండ్లి కాకపోవునా? పెండ్లి మాత్రము పెండ్లియే. ఆచారము మాత్రము మారుచున్నది. ఆమె భార్య, ఆమెయందే సంతానము కనవలయును. ఆ సంతానము నీ వంశమును నిలుపవలయును. నీ యాస్తి యా పిల్లలకే దక్కవలయును. ఇందులో నీవు గతము లేదన్నను భవిష్యత్తున్నది. నీ యీ వర్తమానము రేపు గతము. ఆ భవిష్యత్తు రేపు వర్తమానము. ఎల్లుండికది యు గతమే. ఇంత గ్రుచ్చి యెత్తబడి విడివిడిగా తీయుటకు వీలులేని దీనిలో నిది భూతమని, యిది వర్తమానమని వ్యామోహితుడు కావలయును,

ఇది ఇట్లుండగా మతము పేర సృష్టిలో ననంతమైన రక్తపాతము జరిగినది. కనుక మతము పరిహార్యమని కొందరి వాదన. రక్తపాతము మతము యొక్క దాని పేరనే జరిగెనా? బౌద్ధులు, హిందువులు కొన్ని వేలసంవత్సరములు దేశమున వివాదపడిరి. శైవులకు; వైష్ణవులకు సల్లే జరిగెను. శైవులకు, స్మార్తులకు సల్లే జరిగెను. అప్పుడు జరిగిన రక్తపాతము చెప్పుటకు వీలులేనంత యని యనుటకు నిదర్శనములు లేవు, జరిగినచో జరిగియుండవచ్చును. కాని ముసల్మానులు దేశమునకు వచ్చిన తరువాత మతము పేరిట చాల రక్తపాతము జరిగెను. ఇట్టిది యూరపులోనను జరిగెను. ఒప్పుకొందము. ప్రపంచ చరిత్ర పరిశీలించినచో జరిగిన రక్తపాతములో మతము పేరిట జరిగిన రక్తపాతము దయ్యపుకంటెకి పోలగింప పెద్దదనుటయే కాని శతాంశము కాదు. ఫ్రాన్సు దేశములో విప్లవము జరిగినది. రాజకుటుంబము సంహరింపబడినది. అప్పుడెంతో రక్తపాతము జరిగినది. అది మతము కాదు.

ఆమెరికాలో కొన్ని లక్షలమంది యాదిమనివాసులు సంహారింపబడి అది తెల్లదేశ మైనది. ఆ రక్తపాతము మతము పేరిట జరుగలేదు. ఆఫ్రికాలో నేటివరకు తెల్లవారు నల్లవారిని చిత్రవిచిత్రముగా హింసించుచున్నారు. ఇది మతముపేర జరుగుటలేదు. రష్యాలో జరిగిన హత్యాకాండ సిద్ధాంతము కోసము జరిగినది. కాని, మతముకోసముజరిగినది కాని అక్కడ జరిగిన హత్యాకాండముందు మతము పేరిట జరిగిన హత్యాకాండ ఏమిలెక్క? ఆశ్చర్యమేమనగా ఆఫ్రికాలో నిన్నకాక మొన్న ఘనాకు స్వాతంత్ర్యము వచ్చినది. దానిమీదికి ఉగాండావారు దండయాత్రకు వెళ్లుచున్నారని వార్తలు వచ్చినవి. ఇదిమతమా? చీనా దేశస్థులు నిన్నకాక మొన్న కన్నులు తెరచిరి. అదియొక రాజ్యమని యనిపించుకొనుచున్నది. పట్టుగడ్డలమ్ముకొనెడివారు పట్టణము లాక్రమింప బయలు దేరిరి. మన పూర్వ నాగరికతలో చీనిచీనాంబరములొక యంశము. వారిదొక పెద్దరాజ్యముగా వారి వలన మనదేశమునకొక భయముగా వారికి మనకు సరిహద్దు తగాదాలని యున్నట్లు మన చరిత్రలో వినినది లేదు. కనినది లేదు. నేటివారియాశ మతములో భాగమా ?

ఇంతకు చెప్పవలసిన దేమనగా యుద్ధములు రక్తపాతము మొదలయినవి మానవుని యొక్క దురహంకారము, దురాశ, కామక్రోధములు వీని నన్నింటి నాశ్రయించి యుండునుగాని మతము నాశ్రయించి, సిద్ధాంతముల నాశ్రయించి యుండవు. తత్కాలమునకు నది మతము నాశ్రయించినట్లుండును. సిద్ధాంతము నాశ్రయించి నట్లుండును. మానవులలో వైయక్తముగా దుర్జనులు, దురహంకారులు, దురాశాపరులు నుందురు. వారి వలననే సంఘమునకుచేటు. వారు లేనిచో రాజభటులక్కర లేదు. న్యాయస్థానము లక్కర లేదు. అట్టి మనుష్యులకు నధికారము వచ్చినచో వారిప్రకృతివంటి ప్రకృతిగలిగిన మనుష్యులు వారి కనుయాయులుగా బయలుదేరినచో నదియొకగుంపో, యొక రాజ్యమో యై వారు మతముపేర రక్తపాతము చేయుదురు. సిద్ధాంతములపేర రక్తపాతము చేయుదురు. హిందూమతముపేర జరుగదు. ఇతరుడు తనమీదకు వచ్చినచో నెంతయో తమాయించుకొని చాలవరకు సహించి చివరకెదిరించునది హిందూమతము. అందుచేత హిందూమతమువలన నాపద లేదు. నామతమే లోకమంతయు స్వీకరించవలయునన్న యభిమానమే లేనిది హిందూమతము. తన్ను తాను రక్షించుకొనుటకే పరులమీదికి దండెత్తుట లేదు. దండెత్తి మతమును ప్రచారము చేయనెంచువారును హిందూమతమును నాశనము చేయవలయునన్నవారును మతముపేర రక్తపాతము జరిగినదన్న సాకుచెప్పి హిందూమతమును మరియును దిగద్రొక్కుటకు చేసెడుప్రయత్నమే గాని మరియొకటి కాదు.

రాజకీయ పక్షములలోనున్న విభేదములచేత నేడిన్ని ఘోరములు జరుగుచున్నవి. అది యంతయు సన్మార్గమా? ఎవడయినను తన మతమునందు విశ్వాసము కలవాడు దానినిగూర్చి రెండుమాటలు మాట్లాడినచో నభిమానముతో ప్రవర్తించినచో నదిరక్త పాతమా? నిజమైన రక్తపాతము రక్తపాతముకాదు. నిజమైన హింస హింసకాదు. యజ్ఞములో చంపెడి మేక హింస. అది ఒక్క మేక. అట్టి ఒక మేక ఒక్క ఏడాదిలో సర్వ భారత దేశములో నొకటి కావచ్చును. రెండు కావచ్చును. అదికూడ కాక పోవచ్చును. ఊరూరగల కసాయి దుకాణములలో రోజునకెన్ని మేకలు, ఎన్ని పశువులు? కసాయి దుకాణముల మాటయట్లుంచి స్త్రీ విషయమున, ధన విషయమున, నధికార విషయమున నెన్ని వధలు జరుగుచున్నవి? ఎన్ని రహస్యములయిన వధలుజరుగుచున్నవి? మనిషి ప్రాణము తీయుట మాత్రమే చంపుట, అది యొక్కటియే శిక్షార్హము. తక్కిన హింస యంతయు హింసకాదు. దానికి స్మృతిశాస్త్రమున శిక్షలేదు. అధికార స్త్రీ ధన విషయముల యందు లక్షలకొలది జనములు బ్రతికియున్నన్నినాళ్లు నుద్ధతులైన పురుషులచేత చెప్పరానంతహింస పొందుచున్నారు. దానిని పాలించెడివాడు లేడు. ఆ హింస పడలేక యొకడు హింసపెట్టెడివానిని చంపినచో వానికురిశిక్ష. ద్వీపాంతరవాసము. ఇది స్మృతి లేని స్మృతి.

ఇట్లు చూచినచో గతమునందుగాని, మతమునందుగాని దోషమెక్కువయున్నట్లు కనిపించుట లేదు. వానిని రెంటిని పరిహరించుటకే వీలులేదు. ఇతరములయిన వాని వలెనే. ఈ మాటలుకూడ కొందరి ప్రచారమునకు ననుకూలపడుచున్న మాటలు.

ఒక సిద్ధాంతము ప్రచారము చేయుటకు కొందరు నాయకులుందురు. వారి యనుయాయులుకూడ కొంతవరకు దుర్జనులనియే చెప్పవలసి వచ్చును. ఇచ్చట దుర్జనులనగా తమ సిద్ధాంతమును ప్రచారము చేయుటకు వెనుకముందాడనివారు సదసద్వివేచన చేయనివారు ఆవేశమునకు వెల ఎక్కువకట్టి యాలోచన తక్కువ చేసెడివారని యర్థము.

వారుసరే. పాపము కొందరు ఆలోచనయు, సాలోచనయు లేనివారు తళతళలాడుచున్నది కదా యని దానివెంట పోయెడివారు, వారినిగూర్చి జాలిపడ వలయును. ఈ గతము మతముగూర్చి తిరిగి తిరిగి వ్రాయుచున్న కవులీ జాతివారు. వారికి సిద్ధాంతము లేదు. దానిని ప్రచారము చేయవలయునన్న పట్టుదలలేదు, మతము లేదు. పాడులేదు. ఇట్లు వ్రాసినచో క్రొత్త కవిత్వమనుకొని వ్రాయుట. వీరిసంగతి దయనీయమై శోచనీయమైనది.

ఈ రెండు శబ్దములవంటివి తాజా కవిత్వములో చాలయున్నవి. వానిగతియు వారి గతియు నిట్టివే.

# ఒకడు నాచన సోమన్న-3

విశ్వనాథ సత్యనారాయణ.

ఈ దృష్టితో నరకాసురవధను చూడవలసి యుండును. నరకాసురుడన్నవాడు మొదట భూదేవి కుమారుడు. రెండవది రాక్షసుడు. మూడవది మహాప్రళయకాలమున వరాహమూర్తి తనకొమ్ముతో ధాత్రీదేవిని సముద్ధరించినపుడు పుట్టినవాడు. నాల్గవ విషయము ప్రళయకాలమున ధాత్రీవరాహమూర్తుల సంబంధము, ఆ సంబంధము స్త్రీపురుషసంబంధమా? వట్టి ప్రకృతి విషయికమైన సంబంధము, ఐనచో నీ సంతానమెటులుండెడిది? ఐదవ విషయము వానిని భగవంతుడు కొన్నియుగములైన తరువాత మొన్నటి ద్వాపరయుగాంతమున సంహరించెను. ఈయైదు విషయములలో సామాన్యదృష్టితో చూచినచో నొకదానితో నొకటి సంబంధించదు. రెండుమూడు విషయములు పొసగించుట కష్టముగానుండును. ఒకటి ప్రకృతి విషయము. రెండవది స్త్రీపురుష సంబంధము. మూడవ దనంతమైనకాలము గడచిన వ్యవహారము. ఇందులో మొదటి రెండు విషయములకు పూర్వోక్తములైన కొన్నివిషయములచేత సమన్వయము కుదుర్చవచ్చును. అనగా మనదేశములో మనవైదిక సారస్వతములో జరిగిన కొన్నివిషయములు ఉభయథా జరిగినట్లు వ్యాఖ్యాతమైనదిగదా! ఆకాశమున ఫల్గునీ నక్షత్రోదయము జరిగినప్పుడు దానికెదురుగా ధనురాకార నక్షత్రముల సముదయము జరిగినట్లు దానికి ఫల్గునీ నక్షత్రముయొక్క కాంతి ప్రసారము కలిగి తద్విచ్ఛిత్తి జరిగినట్లు ఖగోళశాస్త్రజ్ఞుల వివేకము కలదు. అర్జునుడు ఫల్గునీ నక్షత్రమునందు జన్మించినాడు. అతడు మత్స్యయంత్రమును భేదించినాడు. ఇట్లేశివుడు మన్మథదహనము చేసినాడు. ఈ సందర్భముకూడ రుద్రనక్షత్రము తత్పరతఃస్థితకొన్ని నక్షత్రములయొక్క యునికియు చాలనమును వాని యస్తమయమును నిరూపించుచుండును. పురాణకథలలోనెన్నియో కథలయొక్క లక్షణము లాకాశమున నున్న నక్షత్రసంచారముచేత నిరూపింపబడుచున్నవి. రహస్యమేమనగా నీసృష్టియంతయు ఖగోళమున నున్న బహుగోళముల సంచారముయొక్క ప్రతిబింబము. అదియే మాటిమాటికిచ్చట జరుగుచున్నది. శివవిష్ణుదేవీ ప్రముఖదేవతల లక్షణములుకాని శ్రీరామచంద్రపార్థాదుల లోకచరిత్రగాని ఖగోళనక్షత్రముల సంచార పద్ధతికి ప్రతిబింబభూతమై జరిగిన లోకమునందలి వర్తమానము. అందుకనియే వేదముయొక్క షడంగములలో జ్యోతిషమొకటి. ఈ సంగతి మరియు వ్యాఖ్యానింపబడవలసిన విషయము. ఇంక నిట్టివెన్నియోకలవు. నవగ్రహములున్నవి. అవియాకాశమునందలి నక్షత్రములు. నవగ్రహ స్తోత్రములు చదివినచో ఆయొక్కొక్క గ్రహము భారతదేశముననొక్కొక్క దేశమునందుద్భవించి బ్రతికినట్లుతెలియును. వారితపస్సుచేసి గ్రహాకృతిదాల్చినట్లుతెలియును. వశిష్ఠాదులందఱిట్టివారు. ధ్రువుడట్టివాడు, శుక్రుడట్టివాడు. ఈసంగతులెన్నియు వేదభాష్యములందచ్చటచ్చట స్పష్టములైన విషయములే. మరియు కీర్తిశేషులైన గొబ్బూరి వెంకటానందవిజయ రాఘవరావుగారు చక్కగా వ్యాఖ్యానించిన విషయములు.

ఈదృష్టితోజూచినచో నరకాసురుడు మొదట ప్రళయసముద్రముచేత సర్వభూభాగము ముంచబడిన తరువాత మరలభూగోళమునుండి చీలిపోయినయొక పెద్దమట్టిముద్దయై యుండవలయును. వరాహమూర్తి కొమ్మనునది వరాహమూర్తితో సహకల్పితమనుకొన్నను భూగోళము ప్రళయజలధినుండి బహిర్గతమగు

వేళ భూమండలములోని యొకభాగముచెదరి పోయి దూరముగా బడియుండవలయును. అదివేరే గోళము కాదు. భూమండలములోనిముక్క. ఆముక్కకూడ తక్కినగోళములతోపాటు భూమియొక్క యాకర్షణ శక్తిచేత భూగోళముచుట్టును పరిభ్రమించుచుండవలయును. దీని పరిభ్రమణమునకు నితర గోళముల యొక్క పరిభ్రమణమునకు చాలావ్యత్యాసముండును. ఇతరగోళములుజలప్రళయమువచ్చిన తరువాత పరల సముద్గమించిన భూగోళమువంటివికావు. వానిపద్ధతి వానిది. వానిపరిభ్రమణ మార్గములు వానివి. ఇట్లు భూగోళమునుండి చెదరిపోయిన ముక్కవలన భూగోళమునకెప్పుడైన సన్నికర్షము జరుగవచ్చును. భూమియొక్క యాకర్షణ దానియందధికముగానుండును.

ఒకానొక వస్తువు కదలుచున్నది. కదలుట యారంభించినది. ఆకదలిక యాగుట యెప్పుడు? మొలుత కదల్పబడిన సమయమునందు దానికదలిక ప్రారంభించువేళ దానిని ప్రచలింపజేసిన వేగశక్తియొక అది కదలుచుండగా దానికి వలికివ నిరోధములుకలిగించు నితరశక్తులయొక దానిసంచలనము సంపూర్ణము బాధాపడి యుండునుగదా! అట్లేభూమినుండి యిట్లు విడిపడిన యీముక్కవిడిపడిన కాలమునందలి యొక వేగశక్తిచేత గొంతదూరముపోవుటయు నచటనుండి వెంటనే వచ్చుటకు నచ్చటి ప్రమాణమైన వేగశక్తి లేకపోవుటయు, సామాన్యమైన భూమ్యాకర్షణ శక్తి మాత్రమే పనిచేయుటనైనను, ఆగోళము యొక్క భూమ్యైకదేశత్వ లక్షణమును. అప్పటికమై యెప్పుడో భూమితో సన్నికర్షజరుగక తప్పకపోవుటయు, నీరెండు లక్షణములు దానియందున్నవి. ఇట్లుండగా నా ముక్కభూమినుండి విడిపడిపోయినవేళయున్నది. ఆ వేళయెట్టిదనగా నది యాశ్వయుజ బహుళ చతుర్దశి నాడు. ఈచతుర్దశి నరకాసురునిపేరులో ముఖ్యమైన స్థానమాక్రమించినది.

ఇచటకొందరికి నొక సందేహము పుట్టవచ్చును. సంవత్సరములు ఋతువులు మాసములు తిథులు సృష్ట్యారంభమైన నాటినుండిగదా ప్రారంభించెను. లేదా సృష్టికొన్నాళ్లు జరిగినతరువాత నెవరోకొందరు వీనిని నియమించిరని కూడ నాధునికులనుకొన వచ్చును. క్రీస్తుమానము పాశ్చాత్య మతగురువులట్లు నిర్ణయించినది కనుక.

అది యట్లుజరుగలేదు. ఈకాలమనంతముగా జరిగుచునేయున్నది. మహాప్రళయ కాలమునందును గూడా కాలముయొక్క లెక్కయుండనేయున్నది. అందుకనియే సృష్ట్యాది గతాబ్దాః అని పంచాంగముల యందు వ్రాయబడుచుండుటయు గలదు. మరియు సృష్ట్యారంభము స్వభాను సంవత్సరమునందు నొక మాసములో నొకదినమునందు జరిగినదని వ్రాయబడియున్నది.

అదియట్లుంచి యీరీతిగా జరిగిన యీవిచిత్రమైన మట్టిముద్దకథ యొకడుండగా నామట్టిముద్ద నరకాసురుడుగా భాసించెను. అమట్టిముద్దకు నరకాసురునకు భేదములేదు. అదియే ప్రాగ్జ్యోతిష పురము. అచ్చట నరకుడు తత్కృతకగోళశక్తి సహితుడై రాక్షసాకారమును బూని వ్యవహరించెను. వాడింద్రలోకముమీదికి దాడిపోయెను. వానిని కృష్ణుడు సంహరించెను.

ఈసంహరించుట ద్వివిధాభూతమైనవిషయము. ఒకటి ప్రళయకాలమునందు విడిపడిన భూఖండము వచ్చి భూగోళమునకుతాకి యాపద గలిగించుట. ఆకాశమునందు పరిభ్రమించుచున్న రెండుగోళముల యొక్క పరస్పరసంఘర్షణము మహావిప్లవ హేతువు కదా! అట్టిగోళమును భగవంతుడైన శ్రీకృష్ణుడు సంఘర్షణముజరుగకమున్నే దానిని చక్రధారలతో ముక్కలుముక్కలు చేసెను. అదివచ్చి భూమికి తగిలినచో భూమికి పెద్దకుదిలింపు. ఆ నరకాసురుడు భూఖండమువంటివాడు. అందుకనియే నాచనసోమన్న

'అతిశితచక్రధార నరకాసురు వ్రక్కలుచేసి' అని వ్రాసినాడు. శిరఃకర్తనము చేయుటకాదు, వానిని సంహరించుటకాదు. వానిని వ్రక్కలుచేయుట. దీని మీద దృష్టిలేనిచో నాచన సోమన్న వ్రక్కలుచేసి యని వ్రాయడు. ఇంకనేదివ్రాసినను వ్రాయవచ్చును.

కనుక నిది రెండుకథలజోడింపు. నరకుడు చచ్చినది చతుర్దశినాడు. ఈచతుర్దశికి నరకునకు సంబంధమేమి ?

> త్వష్టకు నుదాహరకు చతుర్దశియనంగ
> నొక్కకూతురు.గలిగిన యిక్కవెరిగి
> గంధగజరూపమునను నక్కన్యదెచ్చి
> కవసి నరకాసురుండు సౌఖ్యములదేలి
> నాకంబున యందును భూ
> లోకంబునయందు ధనములు మణులుపైత్యా
> నీకంబుదేర మంచివి
> గైకొని యాచంద్రముఖికి గానుకయిచ్చెన్.

ఈరెండు పద్యములను విచారించినచో నరకుడు, వాడుచతుర్దశియన్నకన్యను పెండ్లిచేసుకొనుట వామెకు మణులతోడ నగలుసమర్పించుట మొదలైన లోకవృత్తమిట్లుండగా చతుర్దశినాడు తద్భూఖండము విడిపడుటయు కొన్నియుగముల తరువాత పరల జతుర్దశినాడే దానికి భూమితోడి సన్నికర్షముజరుగవల సియుండగా శ్రీకృష్ణదేవుడానాడే తత్సన్నికర్షమును చక్రాయుధముచేత తత్ఖండమును వ్రక్కలుచేసి భూలోకముయొక్క యాపదను నివారించుచుటయు గనిపించుచున్నది. ఈనరకునియూరు ప్రాగ్జ్యోతిషము. అదియాకాశములోనున్నది. అచ్చటికిరథములుపోవు. అందుచేత భగవంతుడు గరుత్మంతునిమీద వెళ్లవల సివచ్చెను. అందుకవియె 'ఆ విహగేంద్రు నెక్కి వివిధాయుధుడై వియదంతరమ్ముపై తోవజనంగ' అనివ్రాయబడెను.

అది వియదంతరమ్ముపై త్రోవ. ఈ మాట కూడ నరకుని భూఖండలక్షణమును జెప్పుచున్నది. చతుర్దశినాడు భూఖండము విడిపడుట, పరల నాభూఖండము మొన్నటి ద్వాపరయుగాంతమున చతుర్దశినాడే భూగోళ సన్నికర్షము జరుగవలసియుండుట. ఆనాడే భగవంతుడు నరకుని సంహరించుట మొదలైన కథ నరకుడు రాక్షసుడై జన్మించి చతుర్దశిని పెండ్లియాడుటగా జెప్పబడెను. అట్లుజరిగెను. ఇదియె దీనిలోని రహస్యము.

ఆ చతుర్దశి యెవరికూతురు. త్వష్టృ ప్రజాపతి కూతురు. ఆయనభార్యపేరు ఉదాహర. త్వష్టయనగా శిల్పి. ఆయనకాలశిల్పి. కాలవిభజనచేసినవాడు. చతుర్దశియు నమావాస్యయు సామాన్యముగా నొకదాని తోకలిసివచ్చుచుండును. అది తిథుల యేర్పాటులోని యొకలెక్కలోని యొక రహస్యము. ఆ త్వష్టృప్రజాపతి యీరెండుతిథులయొక్క యేర్పాటు నుదహరించినవాడు. తత్త్వము జూచినచో రహస్యమిది. లౌకికముగా జూచినచో త్వష్టయున్నాడు, ఉదాహరయున్నది. వారికూతురుపేరు చతుర్దశి. ఈనరకుడు గంధగజరూపమునవెళ్లి యా చతుర్దశిని గైవసము చేసికొన్నాడు. గంధగజరూపమున వెళ్లుటయేమి? రాక్షసులు కామరూపులు గనుక నట్లునుపోవచ్చును. మరియు నీ నిత్యపరిభ్రమణములో నాభూమండలమునుండి విడిపోయినముక్క మదించిన యేనుగుయొక్క యాకారముతోనుండియుండనోపు. దానితొండముపైపు ప్రతి నరకచతుర్దశినాడు భూమండలమున కభిముఖముగా నుండియుండనోపు.

చతుర్దశీప్రస్తావనచేతను వ్రక్కలు చేసెనన్న మాటచేతను నాచన సోమన్నకు నేతన్మహాకథా గత తత్వవిషయము తెలియునని యూహింపబడుచున్నది. ఇంతమాత్రమునకింత వ్యాఖ్యానమా యనవచ్చును. కవికి కథప్రధానము. ఇట్టివిసూచింతురు. ఇట్టివేకాదు. కథాగత బహువిషములను సూచింతురు. గాఢముగా గూఢముగా చదివెడివానికిది తెలియవచ్చును. తక్కినవారు పూత్కారములుచేసినచో నమోవాకం ప్రశాస్మహే.

ఈ వ్యాఖ్యానము సోమన్నగ్రంథములో నీకథ కెందుకుచేయవలయును? ఆయన వ్రాసిన తక్కిన కథల తాత్పర్యములన్నియు నిర్ణయించిన తరువాత నిది విస్పష్టముకాగలదు.

# లలితా స్తోత్రము | దివాకర్ల వెంకటావధాని

విరత సుధా పరిపూర్ణములు, నిర్మల మంగళ వృష్టి హేతువుల్,
వర కమలా స్వయంవరణ భద్రి మహోత్సవ దీపముల్, భవ
త్పరపిజతుల్య పాదముల సన్నిధిఁజేసిన సేవలంబ! యు
ర్వర ఘన భాగ్యవంతులగు వారికి నేమొనరింప కుండెడిన్.

ఎందఱులేరు దైవతము లీశ్వరనామ కళంకితుల్, లయం
బందుదురెల్లరున్ సరసిజాసన ముఖ్యులు జన్మజన్మ, నీ
మందర పాదముల్ తలకు సోక సకృత్తుగనైన మ్రొక్కు నిం
పొందఁగ నెవ్వఁడా యొకఁడెపో స్థిరసంస్థితి నందఁజాలెడిన్

హ్రీంకారమ్మని చెప్పు వేదములు నీ యాద్యాభిధానమ్ము నో
పంకేజాసన ముఖ్య సర్వదివిషద్వంద్యా! త్రికోణాలయా!
శంకాహీన! నినున్ స్మరింప యమరాట్సంత్రాసమున్ వీడి ని
శ్శంకన్ నందనమందు నుంద్రు జనులాశాపాలక శ్రేణితో.

గరళము కబళించిన శంకరునకుఁ దద్వేగమెడరు కలిగింపదె ని
ర్భర పీయూషార్థము నీ యొఱపగు నఱమేను పరిక్క నుండదయేని!

దేవీ! నీపద పంకజమ్ములకు భక్తిన్ మ్రొక్కినన్ సర్వ వి
ద్యా వైదగ్ధ్యము వాక్పటుత్వమును లబ్ధంబౌట వింతౌనె? ధా
త్రీ వాల్లభ్యము చామరద్వితయమున్ దీవ్యత్సితచ్ఛత్రమున్
శ్రీ విద్యోతితమౌ మణీ మకుటమున్ జేకూరుచుండన్ ధరన్.

నతవాంఛా పరిపూరణక్రియ లసన్నాకద్రుమంబున్ దయా
ప్రతిమాంభోధులునైన నీదగు సుధాపాంగంబులం దల్లి! నీ
సుతుపై నీయెడ బద్ధతృష్ణుని పయిన్ శుంభన్మహా భక్తి పూ
రిత సర్వాంగునిపైఁ దిరంబుగఁ బ్రిసారింపంగదే మొక్కెదన్.

నీ కడగంటిజూపులకు నిక్కపు లక్ష్యములైన మానవుల్
ప్రాకట భక్తిపూరితులు వందలు వేలుగ నుందురైన నా
లోకన సేయుమా! ననుఁ ద్రిలోక సవిత్రి! భవద్దయారస
స్వీకృతి పాత్ర మిట్టిఁడు భువిన్ మఱియొక్కఁడు గల్గు నెచ్చోటన్.

కుంకుమ పంకశోభిత మకుంఠితకాంతి మరీచి మాలికా
లంకృత ముజ్జ్వలన్మకుట లాంఛిత మర్ధ శశాంకబింబ భూ
షాంకము సత్త్రికోణ నిలయంబు సుధార్ద్రమునైన రూపమే
యంకిలిలేక నాదు హృదయంబున నెప్డు తురంగలించుతన్.

శతాబ్దముల తరబడి మతోన్మాదము
తో సతమత మగుచున్న భారతదేశమున ఆ
పక్షపాత ప్రత్యవాయ ప్రహతములయిన మా
వేశముల నతిశయించి గహనములైన తత్త్వ
దర్శనముల యగాధ పథముల నతిక్రమించి
మహోజ్జ్వలము సర్వోపగమ్యమునగు మధు
రభక్తి సంప్రదాయము ప్రాదుర్భవ దశలోనే
యొక పాదుగా నల్లుకొన్న పుణ్యకాలము
పదునైదవ శతాబ్ది. ఆ కాలమున ఆంధ్రదేశ
మున భక్తివాఙ్మయమునకొక ప్రధానాలంబ
ముగా వెలసి విలసిల్లినది తాళ్ళపాక శ్రీ
వైష్ణవ మహాభక్త కవికుటుంబము. అదియొక
మధురభక్తి సంప్రదాయముపాదు. సంగీతకళా
కల్పశాఖ కదియొక మూలవాలము. పద
కవితాలత లల్లిన యొక పందిరి యది. ఆ కవి
కుటుంబమునకు ఆ సంప్రదాయమునకు ఆద్యు
డన్నమయ్యంగారు. అతడొక యుగకారుడు.
పరమభాగవతులు పన్నిద్దరాళ్వారుల పూజ్య
సంప్రదాయములు పుంజీభవించిన పుణ్యమూ
ర్తి. పరమేశ్వరుడు, రమేశ్వరుడు పవళించిన
పాలవెల్లి యలలు పులకింపజేసిన యమృతసేక
మతని వాఙ్మయము. అతని ప్రతిపదము తెలు
గువారి భక్తి సాహిత్య దేవాయతనమున ఒక
యఖండ దీపశిఖ. భక్తి శృంగార సంగీత వాహి
నులకా వాఙ్మయమొక ప్రయాగ. ఆంధ్రము
న 'పదకవితామార్గ సార్వభౌము'డతడు. 'పద
కవితాపితామహా' బిరుదాంకితుడతడు. గాలి

# అన్నమాచార్యుని భక్తి సంప్రదాయము

గావూరి ప్రసన్న సత్యనారాయణ

పోకకుపోవు గాంధర్వమును పదములోపట్టి తన
కంఠమున గంటమున గ్రంథనిబంధన మొనర్చి
సృష్టియే కాదు—ఒక సుస్థిర శిష్ట లాక్షణిక వ్యవ
స్థను ఏర్పరచిన మహాభాగుడతడు. సంకీర్తన
మును ఒక సరస వాఙ్మయ ప్రక్రియగ తీర్చిదిద్దిన
సరస్వతీసంధయు డతడు.

'భక్తి కవితలు రెంటికి నిసర్గ మధుర
ముగు మాహాత్మ్యము నిగ్గుదేరిన ఆవేశము జీవగఱ్ఱ.
కృష్ణ సంబంధమైన భక్తి శృంగారములు భావ
గాంధర్వము నిసర్గ మధురము మనోహరము.
మధురభక్తి నిర్భరమైన హృదయమునుండి
ప్రాదుర్భవించు కవిత తరచు ఆపాతమధుర
మగు గీతి ధర్మము నాశ్రయించు చుండును.
ఆ వాఙ్మయము రసరాజములగు భక్తి శృంగా
రములకును సరస్వతీదేవి తీర్థ ప్రసాదములగు
సంగీతసాహిత్యములకును సంగమస్థానము'[1]

జీవిత మొక విశిష్టమైన యద్వైతముగ
చింతన చేసిన యా మహాభాగుని హృదయము

1. డా. శ్రీ యస్వీ జోగారావుగారి సప్తతంతువునుండి.

ప్రసవించిన భక్తిభావనలు బహుభంగులు. ఆయన తనువెల్ల వైష్ణవము—తలపెల్ల వైష్ణవము.

'వైష్ణవులు గానివారలెవ్వరు లేరువిష్ణు పరిభావనమీ విశ్వమంతయును' అని చిరతలు తీసికొని చిందులు వైచినాడు. ఒక పసికందువలె ఆక్రందించినాడా జగత్పితముందు. తానొక తండ్రివోలె భగవంతునొక బాలునిగా భావించి యుపలాలించినాడు. దాసుడై విన్నపములు చేసినాడు. తానొక స్వామివోలె ఆనలనుపెట్టినాడు. ఆయన పొందుగురించి తానొక గోపికవలె పలవించినాడు. తానే ఒక ప్రియునివోలె జగద్వల్లభునియందు ప్రణయినీ భావమును ఆరోపించి మురిసినాడు. పలుపోకడలు పోయినాడా పోకడలుచెప్ప నలవిగాదు. అయినను ఆ పోకడలన్నిట మధురాతి మధురమైన వివిధ భక్తిభావనా మార్గములలోగల వైశిష్ట్యము నించుక స్పృశింతును. ఒకగోపికయై కృష్ణునిపై నేరములు యశోదతో విన్నవించుచున్నాడు. చూడుడు.

'పుడమిలోన మగలు గలుగు
పొలతులకును దిరుగబోసె
అడవివారి నుండ నీయడమ్మ నీకుమారుడు
భారమైన కుచభరంబుపై చెంగుజారనొత్తె
జారుజూపులాడి మంచి సొగసంటు 2 వెలుగుచు
కోరో చల్లయనుచు మెరుగు కుచము లదర
మెట్టినడచు
గోరుడీసి పారుతెంచె గొమ్మ నీ కొమారుడు'

కృష్ణునిపై నున్న ప్రేమాతిరేకముచే ఆతనితోడి సౌఖ్యము నితరులనుభవింతురేమో యను నీసున గోపికారూపుడయిన భక్తుడుపల్కు మాటలివి. 'కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్' అను నారద భక్తిసూత్రమిట పట్టుచున్నది, భగవంతుని యైశ్వర్య మాధుర్యగుణములు రెండు నీభక్తురాలినిట నాకర్షించినవి. సుఖాభివ్యక్తికి హేతువైన గోపికా కృష్ణుల మనస్సంగమమిట సూచితము. వారిది యిట భోక్తృ-భోగ్య సంబంధము. సుఖాభివ్యక్తి దృష్టాఽదృష్ట భయముగా నుండుటచే నిది మిశ్రభక్తి (భక్తిరసాయనము). భక్తుడు దాసుడై విన్నపము చేసుకొనుచున్నాడు. 'మాకేమి మీరెట్టున్నా మంచిదే నేను పైకొని మీవారమై బ్రతికేము నేము' రాధాకృష్ణుల సేవ సేయుచు బ్రతుకుటే యభీష్టమని భక్తుని విన్నపము. దాస్యరూపమున నాతని భక్తి వ్యక్తమగుటచే నిది దాస్యభక్తి. ఆళ్వారుల సంప్రదాయమున నిది కలదు. సఖ్యాసక్తికొక మెట్టుక్రిందిది. భక్తిపంచక భావనలో రెండవది 'మన్మనా భవ, మద్భక్తో, మద్యాజీ, మాం నమస్కురు' అను గీతాతత్త్వ సంవాది యైనది. పరమాత్మని సంబంధిగ జీవింపదలచు భక్తుని యాచారాదులన్నియు భగవదర్పితములే యగును. [illegible] సయినను, ఆయనను విస్మరించినచో భక్తుడు పరమవ్యాకులత నొందును. ఇట్లుండుట నారదభక్తి సంప్రదాయము. నార

2. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సెలవిచ్చిన పాఠము

దన్తుతదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి చ. స్త్రీరూపుడయిన భక్తుడు పరమాత్మని యైశ్వర్య రూపమునకు విభ్రాంతు పడుట పరిశీలింపుడు.

'వచియింపరాని యిటువంటి నీ యెదుట నా
కుచకుంభముల కాంతికొలుపునా ఓరి
సిరులనము గూడితివి శ్రీ వెంకటేశ, నీ
కరుణకెటు నే నోర్వం గలనా ఓరి'

పూర్వోక్తోదాహరణయందు కంటె ఆత్మ పరిశీలన యందొకపాలు పురోగమించి నాడు భక్తుడు. భగవంతుడు వచియింపరాని గుణములు కలవాడని తెలిసికొనినాడు. అట్టి పరాత్పరుని పొందునట్టి స్త్రీత్వము నొందుట కైన వెనుకాడలేదు. 'వచియింపరాని ఇటు వంటి' అనుటలో సర్వతదాత్మనభక్తి (సర్వము నతడే) సూచితము. 'నీయెదుట నాకుచకుంభ ములకాంతి' అనుటలో నీయందు నేనెంత దాన ననుభావము. భక్తుడు తానొక యణు మాత్రుడని తెలిసికొనబోవు చున్నాడు. ఆ యణువు భగవత్సంబంధనే. ఇది శేష-శేషి సంబంధజ్ఞానము. ఓరి అనుటలో సఖభావము వ్యక్తము. 'నీకరుణకెటు నే నోర్వంగలనా' అనుటలో దాసభావము. వివిధ భక్తిభావ ముల నేక కాలమున తోపజేయగల ధీనిధి. అన్నమయ్యంగారు భక్తిభావావస్థల త్వరితత నే యిది సూచించు నేమో!

భక్తురాలు తన్ను సరిగా పరమేశ్వరు డొల్లకయున్నాడని యాతనిని దీనముగా నెత్తి పాడుచున్నది.

'ఊరకె వద్దొల్లక నీవుండితివా నీ యాలివని
పేరు చెప్పంగ గద్దుగానే ప్రేమతోడను
తేరకొని నీవు నాదిక్కు చూడకుండినను
దూరాన నిన్నుంజూచి సంతోషించం గద్దుగా'

అనుచున్నది. నన్నొల్లకున్నను నీవు నాభర్త వని పేరుచెప్పుకొని సంతోషించు భాగ్యమైన నాకున్నది కదా! అదియే నాకు చాలునని యమాయికమగు పరమప్రేమను వెలిబుచ్చు చున్నది. భర్తగా భగవంతుని దర్శించుటచే నిది కాంతాసక్తి. భగవంతునియందు బాల త్వమును దర్శించి తనయందు భక్తుడు మాతృ త్వము నారోపించుకొను చున్నాడు.

'బయటం బెట్టకురే పక్షులు పాఱెడి పొద్దు
ఓయమ్మ బాలునకు నొవ్వదందురు
పంచలదిప్పకులే పాములు వెళ్ళేటిపొద్దు
కొంచపు బాలుని పైకొనునందురు'

పసిగొల్లడయిన భగవంతుని కెట్టి నా పదనాకిల్లనో యనిరూపమే యూరాటము. పక్షులుపారిన సంగ వైకల్యము గల్గుననుట యను శ్రుతాచారము మాతృహృదయమిందు దర్శనమిచ్చుచున్నది.

అధ్యాత్మ సంకీర్తనల యందీతడు భక్తి-మతము-వేదాంతముల విషయమై వెలిబుచ్చి న విశిష్ట సమన్వయ దృష్టి ప్రశస్యము తిలకింపుడు.

'ఉపాయాంతరము లొల్లక భక్తిచేపట్టి
యెపుడూ తీర్థ ప్రసాదేచ్ఛతోడ
నిపుణత శ్రీ వేంకట నిలయుడె గతియని
ప్రపత్తిగల్గుచే పరమ వైష్ణవము
పరిశుద్ధి నుండుచే పరమ వైష్ణవము'

అని నొక్కి చెప్పినాడు. ఈయన ఇటు ప్రపన్నుడు నైకాంతిక భక్తుడునగుచున్నాడు. మతోన్మాదుల కాయనదొక్కటే యుపదేశము వినుడు. 'ప్రపన్నులకునిది పరమాచారము విపరీతాచారము విడువగ వలయు' ననియే. భక్తి విషయమై ఆయనదొక్కటే మాట.

'ఒక్కొక్క యనుగడుగె ఒగి ముందు పెట్టితే ఎక్కడో కొండైన నెక్కఁగొనకు, పట్టినచోనె వెదకి భావింపవలెగా గట్టిగా నంతర్యామి కనుఁగొనుచును' అని ఆయన ఆధ్యాత్మిక చింతనాభ్యాసమ్మొకని గమనింపుడు. 'మనసు నీ యధీనము మాటలు నీవాడేటివే తనువు నీపుట్టించిన ధనమిది చేగదేర నీవు నన్ను జేసిన మానిసి నింతే' జ్ఞాన దీపపుకాంతి యట్లింతన కల్పించినది. చేరుటకింకను వ్యవధిపట్టును. దానిని సహింపలేక ఎట్టి మాత్సనిందకు గడగి నాతో పరీక్షింపుడు.

'పేరున్నది నాలోన పెక్కు పాకాంక్షములు పూనుమన్న నెన్నినా వ్యూహాలెల్లాను చేయుచున్న వొక్కొక్కటే సేనాసెన కోరికలు యూరికి నున్నాడ నాకు నేది గతియింకను' కర్మజ్ఞాన భక్తిప్రపత్తులనెల్ల వేంకటేశ్వర ప్రీతికై యర్పించిన యాతడుపరమైకాంతుడు. దశవిధ వైష్ణవములందిదియే యగ్రేసరము. దాని లక్షణ మిట్లున్నది. 'ప్రీత్యర్థం వాసుదేవస్య కర్మజ్ఞానాదికం పరః స విప్రః పరమైకాంతీ మహాభాగవతస్మృతః' (ప్రపన్న ధర్మ సారసముచ్చయము) 'అవలవారుల జెడనాడగ వినివిని చేవమీరి యెవ్వరిని జెడనాడక కోవిదు శ్రీ వేంకటేశుగొలిచి పెద్దలకృప నావివర్తన కలవాడుగో వైష్ణవుడు' ఎంతటి సుశిక్షిత సమన్వయ సమాలోచనము! పరమతదూషకులకెంతటి పట్టుగలదెబ్బ! ఆయన దృష్టియే అట్టువంటిది.

'ఏకులజుడేమి యెవ్వడైన నేమి
పరగిన సత్యసంపన్నుడైనవాడే
పరనిందసేయ తత్పరుడుగానివాడు
అదుదైన భూతదయానిధి యగువాడే
తగిలి వేంకటేశు దాసుడయినవాడు'

అని కవికాలమహిమను కాచి తాల్గిన వాడుగ గన్పించును. శేషన్న 'కలికాలము జెప్పనేల కలికాలమహిమరా' అని వాపోవడు గదా! ఇంకను భిన్నుఁడై 'నిరపరాధులు జంపి నెత్తురు వారించగాను తెరలకెట్టుంచిరో దిక్కా-ములు నిరసవర్తనులంతే విపరీత నాయముల గనునాటుంగపట్టాలా కలి కాలమహిమరా' అని స్పష్టార్చిగారు. నీకింత వైష్ణవమేల యని ప్రశ్నించువారికి 'ఎవ్వరివాడాగాను ఏమింగ నిందుకు తలగరో లోకులు తడవకుపోమున్నా నరహరికీర్తన నానిసజిహ్వ ఒరులనుతింపగ నోపదుజిహ్వ' అని యాయన సమాధానము. ఆయనదొక్కటే తుష్టి.

'చిక్కినా లోనైనది శ్రీవైష్ణవ ధర్మము
తొక్కినది భవముల తుదిపదము
ఎక్కినది హరిభక్తి యిది పట్టపేనుగు
ఎక్కువకెక్కువకే కాక యింక నేలచింత'

అని ఆయన హృదయమునపై భక్తిపై జన్మముపై నాయనకుగల విశ్వాసమట్టిది.

భగవంతున కాయనదొక విన్నపము. 'నే నా కడ లేకుండితే నీకృపకు పాత్రం బేది పూని నా వల్లనే కీర్తిబొందేవు నీవు' భగవంతునియెడ భక్తుడిట్టి చనవు నూహించుట సహజము. లౌకిక విషయములందు మాత్రమిట్టి భావ మహంకారముగ భాసించును. జగద్వల్లభుని యందు ప్రణయినీ భావనమును ఆరోపించి యన్నమయ్య మందలించుచున్నాడో వీక్షింపుడు:

'చిత్తమురా బతిమాట చేసితే వేడుకగాక
ప్రత్తికోతం గొసరితే కాంతయింపౌనా
సమ్మతిగా బెనంగితె సతిదాయకుండుగాక
పొమ్మసంగుంపటియైతె పుచిప్పుట్టునా'

అనుకూలముగా వర్తించి మెప్పునంద వచ్చుగాని సొమ్ములకుంపటివలె నేమి యీ వర్తన? అని చీకాకుతో ప్రణయిని పలుకు చున్నది. ఈ ప్రేమస్వరూప సందర్శన నీయము. మధురాస్వాదనమువంటిది. (నా. భ. సూ.) భక్తుడైన భగవంతునితోడి సంగమము నాకాంక్షించుచున్నది స్త్రీరూప భక్తి.

'ఉదుటుజనుదోయినీ యురముపై వనివార
నదిమి మోమున మోమునలమియలమి
వదలైన నీవితో వాలుగన్నులజక్కె
గొదవనిమీదనే నొరగుచున్నదిరా'

ఈమె భక్తి హృజ్జాతమగుటచే సాత్త్విక భక్తి (భ. ర.) ఆతనియెడనున్న కామాసక్తి. కాతనియనురాగ వర్తనమాలస్య మయినదని యాతనికి శిక్ష విధించుచున్నది:

'మంచముపై యిల్లదె మాటలేటికి
నించిన వేడుకతోడ నిద్దురించులోనను
ఇంటికింజెప్పియంపితి నిందాకనేలరావైతి
వంటంగారతాలంగితి నట్టెపుండరా'

అను నాగ్రహము చూపుటతో కోపముకొంచెముపశమించినది. కాని అసలు విషయ మెట్టులో చెవికిచేరినది. అప్పుడు 'ఎవ్వరు గలరమ్మ యింకనాకు నెవ్వగలలో చిత్తము నిలకొన్న దెప్పుడు' అని వాపోయినది. కాని లాభము?

'కూరిమిగొనకుకంటె గుట్టుననుండు టేమేలు చేరి వేరేయొక కాంతంగోరేవాతో' అని తానే సమాధానము చెప్పుకొన్నది. 'నాకునిష్ఠూరాసనీను వద్దనవేజాలను తొలు తేమిచేసితి నే ఆప్యాలినైతి' అని పశ్చాత్తాపభుగ్నయై పలవరించినది. అహంతయంతయు నశించినది. ఇప్పుడామె ధోరణి 'భావించినిన్ను జూచితే పరవశముకాదుంగాని ఆవేళనీతో సరస మరతు' నన్నట్టువంటిది. ఇప్పుడామెయొక జ్ఞానోపదేశిక. 'పెట్టినవినీసొమ్ములు కట్టినదినీ రెంటెము గట్టేదాననేను ఏమిచూచేవయ్యా' అని నాలింపులు సైతము కరుగునట్లాత్మ స్వరూపము విప్పిచెప్పుకొన్నది. 'కాయమిదె ప్రాయమిదె నీకిచ్చిన దేహమిదె - ఎట్టైనంచే యరా' అని ఆత్మనివేదనము గావించుకొనినది. 'నీలోపలనే కలిసి నీవటయెన్నండురా' అనియే యామె మొర యిదికొంచె. ఎరగాని తలచెదర పొంగనున్నప్పుడైన కరగిమరవక నాకడ నూరకుమీరా' అని కడసారిగ ప్రాధేయ పూర్వకముగ బతిమాలుకొన్నది. భక్తసులభుడు తిరువేంకటగిరి దేవుడు కౌగిట కరుణించగ చీకటితెరడగాని విశ్వమెల్ల విష్ణుమయముగ దర్శించి తరించిన ధన్యుడన్నమయ్య.

# మిథ్యాబింబం

వల్లంపాటి వెంకటసుబ్బయ్య

మొదట గర్వమేమో అనుకున్నాను. కానీ కాలంగడచినకొద్దీ యీ అభిప్రాయం నాకు దూరం కాసాగింది. ఆ బిగించిన పెదవులవెనుక యేహోకాన్ని మూగవేదనలు, మసలోకిచూసే ఆకళ్ళవెనుక ఎన్నో బడబాగ్నులు వున్నాయనిపించింది.

మనిషి పొడవుగావుంటాడు. అతని మాట తీరు, నడకవేగమూ అతన్నొక మూర్తీభవించిన అలసత్వంగానూ, అసాంఘిక జీవిగానూ మనకు తోపింపచేస్తాయి. లేచికూర్చోవాలన్నా, కూర్చొని లేవాలన్నా నాలుగునిమిషాలు పడుతుంది. అతని వయస్సు సుమారు ముప్పైఏళ్ళు వుండవచ్చు. కాని మాంసహీనమైన దవడలు. కాంతిహీనమైన గాజు కళ్ళు అతన్ని నలభయ్యేళ్ళవాడిలా తోపింపచేస్తాయి.

నేను ఆహైస్కూల్లో వుద్యోగంలో చేరినరెండవ దినమనుకుంటాను అలా తోటలోనికి వెళ్ళాను. అక్కడ ఒకచెట్టుక్రిందకూచొని ఎదుటకనిపిస్తున్న పొలాలకేసి చూస్తున్నాడతను. ధరాసతి కట్టుకున్న తలిరాకుచీరలా కొండదాకా వరిపొలాలు కనిపిస్తున్నాయి. కొండక్రిందమాత్రము చీరఅంచులా చెఱకుతోటలు కన్పిస్తున్నాయి. ఇంతెపెరిసి, అంతలో అస్పృశ్యమయ్యే భవిష్యత్తులా పొలాలమధ్యనుంచి బయలుదేరేబాట కొండమీద దేవాలయంవద్ద అంత మౌతుంది.

"మీ క్రీ ఫీరియడ్ లేదారాండి?" అన్నాను

"ఔనండి." అన్నాడతను లేస్తూ. "ఇంకా గంట కొట్టలేదండి.

జవాబు చెప్పకుండా వెళ్ళిపోయ్యాడతను. నాకు చివుక్కుమనిపించింది. అతని ఏకాంతాన్ని భంగపరచానేమోనని సమాధానపడ్డాను కానీ అతని యీ వింత ప్రవర్తనకు ఆశ్చర్యపడకుండా వుండలేకపోయ్యాను. ఆదినం రాత్రి పడుకోబోయేముందు మధుసూదనానికి వుదంతం చెప్పాను. "ఆ శనిగాడిసంగతి నీకెందుకోయ్? వాడెప్పుడూ అంతే!" అన్నాడు మధుసూదనం.

మధుసూదనం నాకు బాల్యస్నేహితుడు. ఈ ఊళ్ళో నాకున్న ఒకేఒక పరిచయస్థుడు. అసలువాడిక్కడున్నాడని తెలిసే నేనీ వూరికివచ్చాను. వాడి భార్యపుట్టింటికి వెళ్ళిందికాబట్టి, నేనూ కుటుంబాన్ని పిలుచుకొని వచ్చేదాకా వాడియింట్లోనే నామకాం. వాడిదొక ప్రత్యేకవ్యక్తిత్వం: వాడిమీదవాడికి అపారమైన ఎల్లమాలిన విశ్వాసం! కొండమీదపడితే గోటితో మీటేయగలనన్న విశ్వాసంవుంది వాడికి. కాని ఒకటిమాత్రంనిజం. వాడుపరిస్థితులకులొంగడు. వాటి నతిలేరిగ్గా వ్యాఖ్యానిస్తూ తనకభిముఖంగా తిప్పుకోవడంలో సమర్థుడు.

"అదిగాదోయ్. అతగాడికేమైనా గర్వమా?" మరేమిటనుకున్నావ్! ఎవరితోమాట్లాడడు. కనీసం నాతోగూడా మాట్లాడడు! సాయంకాలం గ్రౌండుకైనారాడు. అలా అందరితోనూకలసి తిరిగితే ఆయన గారి డిగ్రీకి నామర్దా అనుకుంటున్నాడు కాబోలు" అన్నాడు మధుసూదనం.

నిజమే! కాకుంటే అతనేదో నిర్వికల్పసమాధిలో వున్నట్టు కూర్చోవడం యేమిటి? నేనువెళ్ళిపలకరించగానే ధ్యానభంగమయినట్లు లేచివెళ్ళడమేమిటి?

........రోజులు గడుస్తున్నాయి. అతనలాగే వేళకు బడికి రావడం, గంటకొట్టగానే వెళ్ళడం, విశ్రాంతి సమయాలలో తోటలో కూర్చొని దూరదూరాలనుంచి వచ్చి, ఒకచోటచేరి, ఒక ఆకృతి ధరించి అంతలోనే విడిపోతూ, జీవితాన్ని వ్యాఖ్యానిస్తున్న మేఘాలనో, లేక బడివద్దనుండి కొండదాకా పరచుకొని, కొండ అడుగులోకి అదృశ్యమయ్యే వరి పొలాలనో చూస్తూ గడుపుతున్నాడు రోజుల్ని.

మధుసూదనం మాటల్ని ఆనాడు విశ్వసించాను గాని, ఆలోచించేసరికి హేతువాదానికి వాడి నిర్వచనం నిలబడలేక పోయింది. గర్వం వున్నవారిలో పలుగురితోనూ కలసిమెలసి వుండనివారు బహుస్వల్పం. అలాంటివారు ఇతరులతో మాట్లాడినంతసేపు తమ పద్ధతిని ప్రతి కదలికలోనూ వ్యక్తం చేస్తారు. కానీ 'యితనిలో యిలాంటి ప్రవర్తన కనబడదు. అసలు ఇతరులతో మాట్లాడనే మాట్లాడడు. మనమై మాట్లాడిస్తే "ప్రశ్నకు జవాబు"గా తప్పుకుంటాడు. తన పద్ధతిని ప్రకటించుకోడు. అందువల్ల 'అతను గర్వి'అన్న అభిప్రాయం నాలోనుంచి జారుకుంది....

ఒకరోజు హెడ్మాష్టరుగారు అతనికోసం వెదుకుతున్నారు, "తోటలో వుంటారేమోనండి." అన్నాను. "ఓ....అవును. మునాష్! తోటలో ప్రభాకరంగారుంటారు. కాస్త పిలు." అన్నారు జవాను ఉద్దేశించి "ఆయన తిత్తారూ సాబ్"అన్నాడు మునాఫ్ జంకుతూ. "నేనటే వెళ్తున్నాను. పిలుస్తాలెండి," అన్నాను 'థ్యాంక్స్.'

తోటలో కెళ్ళాను. ప్రభాకరం తనమామూలు చోటలోనే కూర్చొని వరిపొలాలకేసి చూస్తున్నాడు. "ప్రభాకరంగారూ!" పిలిచాను. "ఎవరు....? ఓ.... మీరా!" లేవబొయ్యాడు. "కూర్చోండి. లేజరేగా...!"

అయిష్టంగా కూచున్నాడు. అతనికళ్ళు నన్ను చూడడంలేదు. నాలోకి చూస్తున్నాయి. "ఏమిటలా చూస్తున్నారు?" ప్రభాకరం కాస్త కలవరపడ్డాడు. "అబ్బే....ఏమీలేదు. ఆ పొలాలకేసి...." వెదుకబోయినతీగ కాలికే తగిలింది! "అవి మామూలు వరి పొలాలే గదండీ!" అన్నాను కాస్త చనువు సంపాదించాలనే వుద్దేశంతో.

ప్రభాకరం ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి చెప్పడం ప్రారంభించాడు. "అవును....కానీ అవికోతకొచ్చాయి. మరి నాలుగు రోజుల్లో కోసేస్తారు.. అప్పుడు యిక్కడినుంచి కొండదాకా భూమి అనాచ్ఛాదితంగా నగ్నంగా కనిపిస్తుంది. చూడడానికి విచారంగా వుంటుంది".

ఎవర్నో అప్తుల్ని పోగొట్టుకో పోతున్నట్లుగా అతని ముఖం వికలముద్రను దాల్చింది.—

"పొలం అన్న తర్వాత కోతకు రాకుండా వుంటుందా? కొయ్యకుండా ఉంటారా....? అసలు పొలాల కోతలు సంతోష జనకాలు గదండీ!" "మనిషన్న తర్వాత చావడం తథ్యమేగదా. అలాంటప్పుడు యెందుకేడవాలి." "వారు ఆప్తులు కనుక" "మీకు బంధువులు ఆప్తులు. నాకీ పొలాలు ఆప్తులకన్నా అధికమైనవి." అన్నాడు ప్రభాకరం.

ఈ మాటల్లో అతని జీవితానికి సంబంధించిన రహస్యమేదో ధ్వనించింది. ఈ మాటే అతన్ని గూర్చి నేను ఆలోచించడానికి కారణభూతమైంది. కానీ ఆ మాటవెనుక ధ్వనితమైన అతని జీవిత రహస్యమేదో కాగితంమీద రాతలా కాకుండా, నీటిమీద గీతలా అస్పష్టంగా వుంది,

మునాష్ వచ్చి హెడ్మాష్టరుగారు పిలుస్తున్నారని హెచ్చరించాడు. ప్రభాకరం వెళ్ళిపోయాడు. "అతనలా మాట్లాడుతాడేమోయ్"? ఆరాత్రి మధుసూదనాన్ని అడిగాను.

"ఔను. అతనిదీ ప్రాంతంగాదు, కాస్త యాసగా మాట్లాడుతాడు." అన్నాడు మధుసూదనం

చదువుతున్న సినిమా పత్రికమీదినుంచి దృష్టిమరల్చకుండానే.

కంట్లో పుల్లపెట్టినట్లున్న వాడి జవాబుకు నాకు ఒళ్ళుమండుకొచ్చింది. కానీ వాని సమాధానం నాలో ఒక ప్రశ్నను రేపింది.

"మరేవూరు?" "ఈ వూళ్లో ఈ ప్రశ్నకు జవాబు తెలిసిన మానవుడొక్కడే వున్నాడు అతజ్ఞుడుగు." "ఎవరతను?" "ప్రభాకరం"! పకపక నవ్వాడు మధుసూదనం.

ఈసారి వాని నిర్లక్ష్యంచూస్తే గూబపేల్చేయ్యాలన్నంతకోపం వచ్చింది. వాడిచేతులోని పత్రికలాగి గిరవాటు పెట్టి ప్రశ్నించాను. ఆవిషయం యెందుకంత రహస్యంగావుంచాడు?" "అదేమిటి మహానుభావా అన్నీరహస్యాలే! అతగాడు అందరితోకలిసి తిరిగితేగదా యివి తెలియడానికి . . వాడూ .... వాడి గర్వం .... ఛ!"

—రాత్రి పడుకొని ఆలోచించాను.

ఒకవ్యక్తి సంఘానికి దూరంగావుండాలనివుంటున్నాడంటే అతను తనజీవితంలో యేదో క్షమించరాని తప్పుచేసినందువల్ల అతనిలోని సాంఘికభావం చచ్చిపోవాలి. అతడు ఏకాంతంలోతప్ప జీవించలేకపోవాలి. నలుగురితోకలిసి తిరిగితే తననైచ్యం బయటపడుతుందేమోనని అతను భయపడాలి ...... .

ప్రభాకరానికిది సమన్వయించడానికి ప్రయత్నించాను. కానీ కుదరలేదు. ఆలోచనల్లోనే నిద్రపట్టింది ........

ఈ ఆలోచనల్లో ఎనిమిదిరోజులు గడిచిపోయ్యాయి. ఎవ్వరు మాట్లాడించినా బదులుచెప్పని ప్రభాకరం నేనుకనిపించగానే చిరునవ్వులాంటిది నవ్వుతూ పలకరించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఆరోజు బడివదలిన తర్వాత టీచర్లందరూ ఇళ్ళకువెళ్ళిపొయ్యారు. కాని నేనూ ప్రభాకరం కాస్త వెనుకబడి పొయ్యాము. "మీరింకావెళ్ళలేదు?" ప్రశ్నించాడు ప్రభాకరం. లేదు. కాస్తపనుండి ఆగిపొయ్యాను." అన్నాను వెంటనడుస్తూ.

దారివెంబడీ యేవోనిస్సారమైన విషయాలను గూర్చి మాట్లాడుకుంటూ నడుస్తున్నాము. నేనూ ప్రభాకరం విడిపోవలసినవీధి వచ్చింది. మామాటలు మాత్రింతెగలేదు. "అలారూముకెళ్ళి మాట్లాడుకుందాం రండి" అన్నాడు ప్రభాకరం యిష్టంలేనిపని చేస్తున్నవాడిలా. అవును! అతనిగదికెళ్ళాలి. పరిశీలించాలి. అప్పుడైనా ప్రభాకరం ప్రవర్తన అర్థమౌతుందేమో. "అలాగే" అంటూ బయలుదేరాను.

ప్రభాకరం గదితలుపులుదీసి లోపలికెళ్ళాడు. నేను అనుసరించాను. గదినిండా సిగరేట్ పీకలు, పుస్తకాలూ చిందరవందరగా పడివున్నాయి. చిరంతరం పరిచివుండే ఒకపరుపు దుమ్ముకొట్టుకొని పడివుంది. మధ్యలో సగానికి పగిలినఅద్దం కిటికీలో ప్రక్క పవలినబొమ్మలా వుంది.

పగిలిన అద్దంముందు నిల్చొని ముఖందుదువుకున్నాడు ప్రభాకరం. అద్దంలోయిద్దరు ప్రభాకరాలు కనిపించారు. ఏదోస్ఫురించి నవ్వుకున్నాను. నానవ్వు అద్దంలోప్రతిఫలించిందేమో ప్రభాకరంప్రశ్నించాడు. "ఎందుకు నవ్వుతున్నారు?" "ఏమిలే....దు...." "అలాకూర్చోండి." పరుపుమీద దుమ్ముదులిపాడు. కూర్చున్నాను. అర్థంచదివిన పుస్తకమేదో పరుపు ప్రక్కనే పడివుంది. తీసిచూశాను. అదేదో చవకబారు 'సెక్సు' పుస్తకం. "ఈగదికి బాడుగెంతండి" 'పది." స్నానానికి అపొలాల మధ్యవున్న బావికి వెళ్తాను." '...............' 'మీకు భోజనం ఎలాగండి?' ప్రభాకరం ప్రశ్నించాడు. 'నేను కుటుంబంతో వుంటున్నాను.'

పరిభాకరం 'అలాగా....!' అనికూడా అన లేదు. నానుంచి రాబోతున్న ప్రశ్నను వూహించాడు గాబోలు కిటికీవద్దకెళ్ళి నిలబడ్డాడు. కాని నాప్రశ్న నాలోనే యింకిపోలేదు. "మీరింకాబ్రహ్మచారులేనా?"

పరిభాకరం గిఱ్ఱున నావేపుతిరిగాడు. గత జీవితంలోని యేదోవిషాదానుభూతి రేగినట్లుగా మారి పోయింవతనిముఖం. "లేదు." అన్నాడు కల్లోలాన్ని తనలోనే అణచుకుంటూ, "అలాగైతే వివాహితు లన్నమాట!" "కాదు" అన్నాడు. కానీ అతడు చెప్పింది నమ్మలేని విధంగావుంచతని వుచ్చారింఇ. "ఎన్నాళ్ళంకీ యీ అయ్యారుకూడు. హాయిగాపెళ్ళి చేసుకోకూడదండీ?" అన్నాను నవ్వుతూ.

పరిభాకరం ముఖంలో మెరుపులా మార్పు వచ్చింది. అతనిపెదవులమీద చిరునవ్వులాంటిది పొరిడిపోయింది. అదిహృదయంలోని విసానుభూతి వల్ల బయటపడిన చిరునవ్వుకాదు. నాకోసం, నా ప్రశ్నకోసం పొరికిన చిరునవ్వు. "చేసుకుందాం. అన్నీ కలసిరావాలిగదండీ! ఐనా స్త్రీలమీద నాకు నమ్మకంలేదు. పెళ్ళొద్దంటం అంటే స్త్రీనేగదా అని భయంగావుంది." అంటూనవ్వాడు. అతని హృద యంలోనిభావం యిదిగాదు. బహుశా యిది ఆ భావా నికి తొడిగిన చమత్కారం. "పరిభాకరంగారూ! భగవంతుడుచేసిన ఒకేమంచిపని స్త్రీని సృష్టించడం. స్త్రీలేకుంటే పురుషుని జీవితం ఒకయడారి." "ఇది మీవ్యక్తిగతాభిప్రాయం. నేనుచచ్చినా స్త్రీ నినమ్మను" "ఎందుకు"?— పరిభాకరం మౌనం దాల్చాడు. పరిభాకరం జీవితంలో స్త్రీవుంది. బహుశా ఆస్త్రీ ఇతణ్ణి తిరస్కరించింది. అందువల్ల పరిభాకరం జీవితంమోడైందిగాబోలు ననుకున్నాను.

"పరిభాకరంగారూ! స్త్రీని దూషించకండి. స్త్రీ అమృతమూర్తి నేనుకూడా ఒక స్త్రీని ప్రేమించాను. ఆవిదకూడా నాకు ఆత్మార్పణ చేసుకుంది. కానీ మాకిద్దరికీ మధ్యవున్న అగాధం నేను లంఘించ లేనిది. అందువల్ల వాళ్ళనాన్న వివాహానికి అంగీక రించలేదు. అందువల్ల ఆ అఘాతాన్ని ఆవిడే లంఘించి నన్ను చేరుకుంది. మేము వివాహము చేసుకున్నాం. నేడావిడ నాప్రేమలో తన కష్టాలు మరచి పోతుంది." నావల్ల సాధ్యమైనంత పారవ శ్యాన్ని నటిస్తూ అన్నాను.

పరిభాకరం ముఖం అదోరకంగా ముడుచుకుంది. బహుశా నాకథనుగూర్చి అతను ఆలోచిస్తుండాలి....కాస్సేపటితర్వాత అన్నాడు. 'మీరు చెప్పే స్త్రీ స్త్రీగాదు. ఎవరో దేవత. నేను చెప్పేది స్త్రీల సంగతి....'తర్వాత' "నేనుకూడా ఒకస్త్రీని.... కాదు....నన్నుకూడా ఒక స్త్రీ ప్రేమించింది. అవి కాలేజి రోజులు. ఆవిడ ప్రతిదినం నాకు ఉత్తరాలు రాసేది. నేను తన ప్రేమ నంగీకరించకపోతే ఆత్మ హత్య చేసుకుంటాననేది. కానీ నేనావిడను ప్రేమించలేక పొయ్యాను. ఆ విషయం ఆవిడకు తెలిపాను....ఆవిడకు తర్వాత వివాహం నిశ్చయ మైంది. వివాహానికిముందు నాకొక ఉత్తరంరాసింది. తాను ఆత్మహత్య చేసుకో బోతున్నానని. అందుకు కారణం నేనేనని. ఆ వుత్తరాన్ని చించి పారేశాను. స్త్రీ ప్రేమకోసం త్యాగం చేస్తుందంటే నమ్మలేకపో యాను........కానీ తర్వాత ఆవిడ నిజంగానే ఆత్మ హత్య చేసుకుంది."

పరిభాకరం చెప్పినకథ అంతా నిజం అవడా నికి వీలులేదు. అందులో పరస్పర విరుద్ధమైన విష యాలు చాలా ఉన్నాయి....కానీ పరిభాకరం ముఖం అదోరకంగా మారిపోయింది. తనవద్ద దాచుకున్న ఏ అమూల్య నిధినో నేను దోచుకున్నట్లుగా ఆ గాజు కళ్ళు నాలోకిచూస్తున్నాయి. హఠాత్తుగా పరిభాకరం నాచేతులు పుచ్చుకొని బతిమాలాడు. "దయచేసి ఈ విషయాలు ఎవరితోనూ అనకండి." ....పరిభాకరం కంఠంలో మింగుడు పడక గొంతులో దుఃఖం గుడ గుడలాడింది.

ఎదురుగానిల్చున్న మహావృక్షం ఒకక్షణంలో అంతర్హితమయినట్లుగావుంది పరిభాకరంలో గల్గిన ఈ హఠాత్పరిణామం. నేను దిగ్భ్రాంతుణ్ణయిపోయ్యాను. దిగ్భ్రాంతినుంచి తేరుకునేసరికి నాగది లోవున్నాను.

పరిభాకరాన్నొక స్త్రీ ప్రేమించింది. అతను తిరస్కరించాడు. ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. అందువల్ల పరిభాకరం స్త్రీని నమ్మడు....ఈ సంఘటనలు హేతుబద్ధంగా లేవు. పరిభాకరాన్ని ఆవిడ నిందించాలి గానీ పరిభాకరం నిందలో అర్థంలేదు. ఈ విషయాన్నే మధుసూదనంతో అన్నాను.

"ఆ నింద తనమీదవుంచి ఆ 'స్త్రీ' చచ్చింది. కాబట్టి తాను స్త్రీని నమ్మకపోవడానికి తనకు రాజ్యాంగరీత్యా అధికారంవుంది అంటాడోయ్ పరిభాకరం!" అన్నాడు మధుసూదనం.

నావూహాకు మధుసూదనం యిచ్చిన తేలిక వ్యాఖ్యానంలో నాకో విషయం స్ఫురించింది. పరిభాకరం తనకు తెలియకుండానే ఆవిడను ప్రేమించి వుంటాడు. ఆవిడ చనిపోయిన తర్వాతగానీ ఆవిషయం అతనికి తెలిసివుండదు. బహుశా అదే సంఘానికి మారం చేసిన 'నేరం' కావచ్చు!

మరునటి దినంనుంచి పరిభాకరం తప్పుకొని తిరగటం ప్రారంభించాడు. నాదర్శనమే అతనికి కంటకప్రాయమైంది. అతను నాకేసిచూచిన ప్రతి చూపులోనూ నాపట్ల అతనికిగల భయం, అసహ్యం ద్యోతకమయ్యాయి.

నాలుగు దినాలు గడిచాయి. ఒకరోజున పరిభాకరానికొక వుత్తరం వచ్చింది. పరిభాకరానికంటె ముందు 'లెటర్‌బోర్డు'లో నేనే చూశాను. పరిభాకరానికి వుత్తరాలు ఎక్కువగారావు. అందువల్ల ఈ వుత్తరంలో అతని జీవితానికి సంబంధించిన రహస్యమేదో తెలియవచ్చు. ఆ ఉత్తరాన్ని తీసిచూడాలన్న నీచమైన, అనాగరికమైన కోరిక నాలో రేగింది. అలా ఉత్తరాలు చూడడంతప్పని ఆక్షణంలో నాకనిపించలేదు. నాలోని ఏదోశక్తి, ఏదో కోరిక ఆ ఉత్తరాన్ని నాజేబులో వుంచుకునేలా చేసింది. రాత్రి పడుకోబోయే ముందు ఉత్తరాన్ని చించి చదివాను.

చిరంజీవి కుమారునికి,

ఓ తండ్రి ఆశీర్వాదాలు—

నీకు యిదివరకు చాలా ఉత్తరాలురాశాను. ఒక్కదానికిగూడా నువ్వు జవాబురాయలేదు. నీకోసం మీఅమ్మ బెంగపెట్టుకుంది. చెల్లి నీగుర్తే మరిచిపోయింది. ఇంత శిక్షకు మేము చేసిన ద్రోహమేమిటి?. ఆజరిగిన ద్రోహం దైవమేచేశాడు... చివరిసారిగా రాస్తున్నా. ఈశలవుల్లోనైనా యింటికిరా..." ఉత్తరం ఎక్కడినుంచి వచ్చిందో చూశాను. విజయనగరం.

ఉత్తరం ఒక సమస్యను పరిష్కరించినా అనేక అనుమానాలురేపింది. పరిభాకరానికి కన్నవారు, పుట్టినవారుకూడా వున్నారు; కానీ అతను వారిమీదవున్న మమకారాన్ని తెంచుకొని వారికి దూరంగా జీవిస్తున్నాడు. తల్లిదండ్రుల మీద ప్రేమ. మమకారం కూడా పరిభాకరంలో ఎందువల్ల నశించాయి? ఆలాంటి అపరాధం వారేం చేశారు? ... సమాధానాలురాని ప్రశ్నలు కుప్పలుతెప్పలుగా ఉద్భవిస్తున్నాయిగానీ పరిభాకరం పరివర్తనకు మూలమైన అతని సమగ్రరూపం మాత్రం పొడగట్టలేదు.

రాత్రిల్లా నిద్రనుదూరంచేసి ఆలోచించాను. పరస్పర విరుద్ధభావాల సంఘర్షణతప్ప ఒకే ఒక నిర్ణయానికిగూడా రాలేకపోయ్యాను. . ముఖ్యంగా రెండే రెండు ప్రశ్నలు నా ఆలోచనా మార్గానికడ్డు నిలిచాయి— అతణ్ణి ప్రేమించిన స్త్రీ ఆత్మహత్యవల్ల తనవారికెందుకు దూరమయ్యాడు? పరిభాకరానికి "దైవంచేసిన ద్రోహం' యేమిటి?

రెండవరోజు ఆవుత్తరాన్ని యధాతధంగా అతికించి 'లెటర్‌బోర్డు'లోనేవుంచాను. ఆవుత్తరాన్ని అందుకొన్న ప్రభాకరంలో కలిగే పరిణామాన్ని పరిశీలించాలనుకున్నాను........'మీకేదో ఉత్తరం వచ్చి వట్లుంది, తీసుకున్నారా?' ప్రశ్నించాను అనుదినం సాయంకాలం. 'ఆఁ.... తీసుకున్నాను.' అన్నాడు ప్రభాకరం మామూలుగానే.

నేను పరిశీలించాలనుకున్న పరిణామం ప్రభాకరంలో కలుగలేదు, ఇలాంటి ఉత్తరాలు రావటం అతనికొక మామూలు విషయంలాగుంది ............ "ఒరేవ్! నీకొక రంజైన విషయం చెప్పనా?" అన్నాడు మధుసూదనం ఒదినం రాత్రి పడుకోబోయే ముందు,

"ఏమిటోయ్?" అన్నాను చిరాగ్గా. "అంత చిరాకెందుకోయ్! అసలు నేను చెప్పాలనుకున్న విషయం చెప్పనంటే అమాంతం మదీయ చరణపంకజాలు పట్టుకొని బ్రతిమాలి 'మిల్క్‌బార్'కి తీసుకెళ్ళి కోవా వగైరాలు నైవేద్యంపెట్టి మరీ బ్రతిమాలుకుంటావ్, ఆ విషయంచెప్పమని." "ఏమిటారి అంత లావాటిసంగతి." 'శ్రీ ప్రభాకరంగారి ప్రేమలీల.'

నన్ను ఆశ్చర్యం తలమున్కలు చేసింది. ప్రభాకరం జీవితంలో యింకా శృంగారానికి చోటు వుంటుందని నేను అనుకోలేక పోయ్యాను. నాకు కలిగిన ఆశ్చర్యం విచిత్రమైంది. నేను నిర్ణయించుకొన్న రేఖల్ని, జరిగిన విషయాలు చెరిపేస్తే కలిగిన ఆశ్చర్యమది! 'అసలు సంగతేమిటోయ్!' 'ఆఁ.... అలారా దారికి! నిన్నరాత్రి రాజశ్రీ ప్రభాకరంగారి రాజనగరులో ఒకానొక స్త్రీరత్నంవున్న అనుమానం కలిగిందొక నవయువకునికి. ఆ రహస్యమేమిటో తేల్చుకోవడానికి గదిబైట గొళ్ళెం పెట్టాడట ఆ నవయువకుడు....బయటకూర్చొని కాపలాకూడా కాశాడట. తీరా చూస్తే ఆ నవయువకుడిగారి చెల్లెలేనట. ఆ స్త్రీరత్నం! అందువల్ల ఆ రహస్యం అంతటితో గప్‌చిప్!"

మధుసూదనం మాటలు క్రాస్‌వర్డు పజిల్సు లాగున్నాయి. అందులో నేను వూహించి పూర్తిచేసుకోవలసినవి కొల్లలుగా వున్నాయి. శ్రమించి పూర్తి చేసుకున్న తర్వాత అవి నానిర్ణయాలకు వ్యతిరేకంగా వుండటం ఖాయం! అందువల్ల ఆలోచించడం మానుకున్నాను. "పోనివ్వు మధుసూదనం! ఎవరే ఏటివెంట కొట్టుకుపోతే మనకేం! ఐనా అతనలాంటివాడంటే నేను నమ్మను" అన్నాను. మధుసూదనం బిగ్గరగా నవ్వాడు. "ఒరేయ్ నాన్నా! నేను చిన్నపిల్లాణ్ణి కానురా నీమాటలకు పొంగి పోవడానికి.... అయినా విను. మీ ప్రభాకరంగారికి స్త్రీలమీద ఎంత ద్వేషంవుందో అంతకు రెండింతలు వారి అవసరం కూడా వుంది.." "చాల్లేవోయ్!" అన్నానుకోపంగా.. "అందుకేరా తెలిసిన వాళ్ళన్నారు. ప్రేమికుడికి ప్రేమలోని విషాదం తెలుసు. ప్రేమల్లో నమ్మకం లేనివాడికి ప్రేమలోని మాధుర్యం తెలుసు అని." బిగ్గరగా ఒకసారి నవ్వి దుప్పటి కప్పుకున్నాడు మధుసూదనం.

రోజులు గడుస్తున్నాయి....ఒకరోజున హఠాత్తుగా మా అక్కయ్య దిగింది, ఆవిడ తిరుపతి కాలేజీలో లెక్చరర్. నన్ను చూడాలనిపించిందట, వచ్చేసిందట. ఆరోజు రాత్రి యిద్దరం సినిమా కెళ్ళాము. ఆ వూళ్లో ఒక చిరుగుల "టెంటు"వుంది. అందులో నేను ఏడో తరగతి చదివేరోజుల్లో చూచిన చిత్రాలు ఆడుతుంటాయి. ఈ పంక్తులకు చరిత్ర చదువుకున్నవారికి పాతవస్తువులన్నా, అందరూ మరచిపోయిన సంఘటనలన్నా చాలా యిష్టం! మాఅక్కయ్య ఆ చెత్త చిత్రము చూచి తీరాలంది! వెళ్ళాము.... కాస్సేటికి సినిమా ప్రారంభమయింది, మరి కాస్సేపటికి ప్రభాకరంవచ్చి మాప్రక్కనే కూర్చున్నాడు- నేను పలకరించాను.

"ఓహో....ఆఁ....అలాగా సినిమాకొచ్చారా!" అన్నాడు అక్కయ్యకేసి చూస్తూ. సినిమా చాలా అసహ్యంగావుంది. మధ్యమధ్య బూతుల్లాంటి నాటు రకం ఛలోక్తులు, శరీర రేఖలను ప్రదర్శించేనాట్యాలు విసుగెత్తించాయి. కానీ ప్రభాకరం చాలా వుత్సాహముతో చూస్తున్నాడు. ఎల్లప్పుడూ బిగించబడివుండే అతని పెదవులు కొద్దిగా విచ్చుకున్నాయి. మాంసం లేని బుగ్గలమీది చర్మం ముడుతలు పడివుంది.

'ఇంటర్వెల్'లో ప్రభాకరానికి అక్కయ్యను పరిచయం చేశాను. "నమస్కారమండీ!" అన్నాడు ప్రభాకరం ఉత్సాహంగా. మళ్ళీ సినిమా ప్రారంభమైంది. సినిమా వదిలేవరకూ యిద్దరూ మాటల్లో పడ్డారు. అక్కయ్య ఒక గచ్చకాయలకుండ! మాట్లాడకుండా క్షణం వుండలేదు. కానీ ప్రభాకరం గూడ అక్కయ్యతో సమానంగా మాట్లాడుతున్నాడు. పరస్పర అభినందనలూ, ఖండనలూ నవ్వులో కలిసి నాకర్ణపుటాలను చేరుతున్నాయి....సినిమా వదిలారు. శలవు తీసుకొని ప్రభాకరం వెళ్ళిపొయ్యాడు.

"ఎవర్రా యీ ద్విపాద జంతువు?" అంది అక్కయ్య "ఏం?" "అలా చూస్తాడేం? ఎప్పుడూ ఆడదాన్ని చూడలేదా ఏం?'' 'ఎలా చూస్తాడేమిటి?' "వికృతంగా నమిలిమింగెయ్యాలన్నంత ఆశగా!" "పాపం! అతను అవివాహితుడు. అందుకు కారణం వుంది! అతణ్ణో అమ్మాయి ప్రేమించింది. అతను తిరస్కరించాడు. ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. ఆనాటినుంచి అతను స్త్రీ అంటే మండిపడుతాడు." "ఆదిగాదురా చవటా! అందుకు ఆవిడ యితణ్ణి నిందించాలి గాని యితనెందుకు ఆవిడనునిందించాలి? నే చెప్పనా అసలు విషయం! ఏ ఆడదీ యితగాణ్ణి ప్రేమించదు. స్త్రీకి నచ్చే గుణాలితనిలో లేవు." "ఇది నాలుగైదేళ్ళనాటి సంగతి'' అన్నాను. నాలుగైదేళ్ళుగానీ, నలభైయేళ్ళుగానీ నే చెప్పిందే నిజం! వాని ముఖంచూస్తే తెలీడంలేదూ! కుద్దదగాకోరు ముఖం! పాపం. ఆ అమ్మాయిని అన్యాయం చేసుంటాడు. అందువల్ల ఆ అమ్మాయి యే బావిలోనో దూకుంటుంది! ఆఁ....వీడుమాత్రం అలా చావకుండా పోతాడేమిటి!"

నేను జవాబు చెప్పడానికి ప్రయత్నం చెయ్యలేదు. ఎందుకంటె మధుసూదనం అన్నమాటల్ని ఆవిడ ధ్రువపరచింది. ప్రభాకరానికి స్త్రీయొక్క అవసరంవుంది. అది బహిర్గతం కాకుండా వుండటానికి అతనుతగిలించుకున్న ముసుగులు స్త్రీద్వేషం. వివాహాన్ని వాయిదా వేయడం. కానీ- వివాహాన్ని వాయిదా వెయ్యడంలో మనకు అర్థం కనిపించకపోవచ్చు. ఇలా యీ నిర్ణయాలుగూడా తార్కికంగా నిలువక పోవచ్చు! కొన్ని యథార్థాలు తార్కికంగా నిలబడక పోవడంలో ఆశ్చర్యంలేదు. అంతమాత్రం చేత వాటిని నమ్మకపోవడానికి వీల్లేదు.

ప్రభాకరంలో నాకు మరికొన్ని ఆలోచనీయమైన చేష్టలు కనిపించాయి. అందులో మొదటిది ఏకాంతం! సంఘంనుంచి తప్పుకో దలచినవాడూ, తనమీద తనకే నమ్మకంలేనివాడూ, కవులు, వేదాంతులూ ఏకాంతాన్ని కాంక్షిస్తారు. ఆలోచనలు బాగా సర్వతోముఖంగా సాగాలంటే ఏకాంతమే యోచనాపరులకు శరణ్యం. ఇదిగూడా సంఘంనుంచి, తోటి మానవులనుంచి తప్పుకోవడం తప్ప మరేంగాదు. కానీ వారు ఏకాంతంలో సాధించిన ఘన కార్యాలను సంఘంకోసం వుపయోగిస్తారు. ప్రభాకరానికీ, వారికీ అదే తేడా!

....ఇలా దినానికొక క్రొత్త సంఘటనచూచి దినానికొక క్రొత్తవార్తవిని విభ్రాంతుణ్ణయేవాణ్ణి. ఈ సంఘటనలు, వార్తలు నన్ను మరింత కలవరపెట్టాయేగానీ ప్రభాకరాన్ని అర్థం చేసుకోవడానికి యేవిధంగానూ వుపకరించలేదు.

మరికొన్ని దినాలకు ప్రభాకరానికొక వుత్తరం వచ్చింది. నా దురలవాటుప్రకారం ఆవుత్తరాన్ని

పొంగతనంగా చించి చదివాను. ఆ పుత్తరం నాలో అంతకు ముందున్న కరుడుకట్టిన ఆలోచల్ని చెరిపేసింది. పరిభాకరంలాంటి మిశ్రమ మనస్తత్వం గల వ్యక్తిని పరిశీలించడం సులభంకాదని నిరూపించింది. ఉత్తరం రాసిన ఆవిడ పేరు సీత!........ఆవిడ పరిభాకరంభార్య—తనుచేసిన 'అపరాధాలు' క్షమించమని ప్రార్థిస్తూ తను ఫలానారోజున బయలుదేరి వస్తున్నానని రాసింది.

మామూలు ప్రకారం ఉత్తరాన్ని పరిభాకరం అందుకున్నాడు. ఆ పూటనుండి నాలుగు రోజులు సెలవు పెట్టాడు. ఒక్కమాటలో ఆ పుత్తరం అతన్నొక పిచ్చివాణ్ణి చేసింది.

ఇంతలో బెజవాడనుంచి మా తాతగారు ప్రమాదావస్థలో వున్నారన్నవార్త అందింది. నేను ఆ రోజే బయలుదేరాను. అదృష్టవశాత్తు నాలుగురోజుల్లో తాతగారి ఆరోగ్యంకాస్త కుదుటపడింది. నేను మళ్ళీ తిరుగు ప్రయాణం ప్రారంభించాను. ఆ నాలుగు దినాలనుంచి సరిగా నిద్ర లేనందువల్ల బడలికగా వుంది. అందువల్ల కాస్త మేనువాలుద్దామనిపించింది. రైల్లో జనం అంతగాలేరు. ఉన్నవాళ్ళంతా జోగుతున్నారు. రైలు వేగంతగ్గింది. ఏదో స్టేషన్ వచ్చే లాగుంది. బహుశా ఈ స్టేషన్లో జనం ఎగబడవచ్చు. అందువల్ల పడక సరిచేసాను. అంతలోనే రైలు ఆగింది. అదృష్టవశాత్తు ఎవరో ఒకావిడే ఎక్కింది. చేతిసంచి మినహా మరేమి సామాను కూడా లేదు.

ఆవిడ అందకత్తె అనడానికి నిదర్శనాలులేవు. కళ్ళలో కాంతి మినహా మొగంలో కళలేదు. లోపలికి అడుగు పెట్టగానే కనుబొమ్మలవిల్లులో సమ్మోహనాస్త్రంలాంటి చూపును సంధించి విసరింది. ఆ చూపే ఆవిడ అందం! ఆచూపే ఆవిడ జీవనాధారం కూడా కావచ్చు!........ఎందుకైనా మంచిదని నిద్రపోవటానికి ప్రయత్నించాను....

నాకు మెలకువ వచ్చేసరికి రైలు ఏదోస్టేషన్లో ఆగివుంది. మెలకువ వచ్చినా యింకా మగత వదల్లేదు' అలాగే మత్తుగా వాలీకేసి చూచాను. రాత్రి మూడున్నర! ఉన్నట్లుంచి 'ఆవిడ' జ్ఞాపకంవచ్చింది. చుట్టూరా చూశాను. అవలవైపు కిటికీలోనుండి ఆవిడ ఎవరితోనో మాట్లాడుతోంది. పెట్టెలో ఎవరూ లేరు! ప్లాటుఫారంమీద దీపాలు అతనిమీద వెలుగును ప్రసరింప జేస్తున్నాయి. అల్లిన బనీను పరిస్ఫుటంగా కనిపించే తెల్లని మల్లులాల్చీ. మధ్యపాపిటితీసి యిరువైపులకూ ఎగదువ్విన క్రాపింగు కావురేసి పోయిన రెప్పలమధ్య నిప్పుకణికల్లాంటి కళ్ళు! ధూమపానం వల్ల నల్లబారిపోయిన పెదవులు! ఒకసారతణ్ణి చూస్తే జన్మలో మరువలేము!

"ఇక్కడనే దిగు!" అంటున్నాడతను "ఊఁహూ" అందావిడ. "అబ్బోయ్ పతివ్రత వయ్యావేంటి!" చెట్టువిరిగి పడినట్లుగా నవ్వాడతను. ఆవిడకళ్లు తుడుచుకుంది. "దిగమంటే ఏంటీవరస!" "క్షమించు! నేను దిగను!....మరిచిపో!"

జవాబుగా అతను లోపలికొచ్చాడు. నేనునిద్ర నటిస్తూ గమనించాను. అతను ఆవిడ చేయిపట్టుకొని బలవంతంగా దింపబొయ్యాడు. "నామాట విను...." ఆవిడేమో చెప్పబోయింది. "రేపెల్లుగానీలే!"

చెయ్యిపట్టుకొని బలవంతంగా దింపాడతను. ఆవిడ విసుక్కుంటూ దిగింది! తృప్తిగా వూపిరి పీల్చుకున్నాను...

అందుకోవలసిన బస్సు తప్పిపోవడం వల్ల ఆలస్యంగా ఇల్లు చేరాను. బడికి ఆలస్య మౌతుందేమోనని బడివద్దనే బస్సు ఆపి దిగాను.

బడి బజారులావుంది. ఒకటే అరుపులు, కేకలు! ప్రతి చెట్టుక్రిందా జనం గుంపులు గుంపులుగాచేరి ఏదోవిషయాన్ని తీవ్రంగా చర్చించుకుంటున్నారు! ఏదో అసామాన్య సంఘటన జరిగినట్లుగా వాతావరణం వుద్రిక్తమై వుంది. ఏదో అర్థంగాని

ఆందోళన. విషయం తెలియనందువల్ల అదొక రకమైనభయం నన్ను పెనవేసుకున్నాయి.

మధుసూదనం ఎదురయ్యాడు. "ఏమిటోయ్ ఈసంత?" ఆత్రంగా ప్రశ్నించాను. "సంత కాదు భయ్యా వింత! నీకు బ్రహ్మాండమైన విషాదవార్త." "ఏమిటి?" "మీ డియర్ ప్రభాకరం బాల్చీని తన్నేశాడు." "అంటే?" "అంటే నిన్నటి ఉదయం జలక్రీడలకని సరోవరానికెళ్ళిన శ్రీ ప్రభాకరం మహారాజులుంగారు ప్రమాద వశాత్తు ఆ జలకన్యల కౌగిలిలో శాశ్వతంగా కన్నుమూశాడు."

నా మెదడులోని రక్తనాళాలన్నీ ఒక్కసారిగా బ్రద్దలయినట్లయింది. నాతలలో వెయ్యి అగ్ని పర్వతాలు ఒక్కసారిగా విచ్చుకున్నాయి. ఆరోజు బడికి శలవు, వదిలేశారు. అందరం బావిదగ్గరికి వెళ్ళాము. అప్పటికే పోలీసులు శవాన్ని బయటికి తీశారు.

అందరిలోకీ చూచే ఆకళ్ళు యింకా తెరుచుకునే వున్నాయి. కానీ జలచరాలు వాటిని తూట్లుపొడిచేశాయి. నిరంతరం బిగించివుంచే ఆ పెదవులింకా బిగించబడే వున్నాయి. అవి విచ్చుకుంటేనే ప్రభాకరం అర్థం అవుతాడేమో?

అప్రయత్నంగా నా దిక్కులో రెండు కన్నీటి బిందువులు నిలిచాయి. కళ్ళు తుడుచుకుందుకు జేబురుమాలుకోసం జేబులో చెయ్యిపెట్ట బోయ్యాను. "ఇదిగో...." అందిచ్చాడు మధుసూధనం నవ్వుతూ.

* * * *

మరుసటి దినం నేనూ మధుసూదనం బస్ స్టాండ్ వద్ద నిలబడి వున్నాము.

"ఏమండీ!" ఒక స్త్రీకంఠం పిలిచింది. వెను తిరిగి చూశాను. కాళ్లుభూమిలో కూరుకుపొయ్యాయి. కనుబొమ్మల విల్లులోనుండి సమ్మోహనాస్త్రంలాంటి చూపును సంధించి వదలిందావిడ! "ఏమిటండీ?" అన్నాడు మరొకడు నేనుకాకపోయినా. "ప్రభాకరం మేష్టారుగారిల్లు తెలుసా".... "మీరెవరండీ?" సభ్యతను జయించి దూసుకొని వచ్చింది నా ప్రశ్న. "వారు. ..మా వారే!"

అంతమాత్రమే నాకు వినిపించింది........ ఆరైలు....అతడు ఆవిడను లాక్కుపోవడం....ఆవిడే యీవిడ కావడం....ఆచూపు....ప్రభాకరానికి వచ్చిన ఉత్తరం. పెదవులు బిగించి రహస్యాలు దాచుకున్న ప్రభాకరం భౌతిక దేహం—అన్నీ నా మనస్సులో మెదిలాయి....దూరాన అవిడ మరొకరినివిచారిస్తోంది.

"మధుసూదనం!" "ఏం?" అన్నాడు మధుసూదనం ఆవిడకేసి ఆశ్చర్యంగా, కోరగా చూస్తూ. "ప్రభాకరం పొరపాటున బావిలో మునిగిపోలేదు.... ఆత్మహత్య చేసుకున్నాడు."

ఏనాడూ ఒక విషయాన్నిగూర్చి రెండు నిమిషాలు ఆలోచించి యెరుగని మధుసూదనం ఆలోచనలో పడ్డాడు.

## దుఃఖ పతాక | సుప్రసన్న

చిన్నారి కోరికల్ ఎడద చిక్కులు వడ్డవి-తృప్తి లేమి లో
కన్నులు విచ్చుకొన్నవి-ఒకానొక దుఃఖము త్రోవలోన ఆ
పన్నత వాంఛలుద్గలిత బంధము, లచ్చర కొప్పుకోసలో
క్రొన్నన విచ్చు వాసనల కోసము వేచుటగా కనంబడున్.

ఈ దుఃఖమ్ముల కంతులేదు, ఎదకోరే వస్తువుల్ రావు అం
దేదో వచ్చినయట్లు తోచియును కానేకాదు వాంఛావధుల్
పాదై కాలము తీవయై, మనన దీప్తంబైనచో దుఃఖ పు
ష్పోదారంబయి చేదు తావులను విచ్చున్ మానసాద్వంబునన్.

నేడీ దుఃఖ పతాకమెత్తికొని నన్నే నేను శిక్షించుకొ
న్నాడన్, ఆకలి కాల్చివేయవలె అంతా రాత్రియున్ మేలుకొ
న్నాడన్, నిద్ర కృశింప జేయవలె మన్నై పోదునో? శోకగం
గా దీనంబున ఊపిరాడ కను మార్గాలన్ ప్రమత్తుండనై.

ఏడుపులందు ఏడ్పులు స్ఫురించెడి ఈ నడిరేయి అంచులో
పాడనిగొంతులో తిరుగబడ్డ సుధామయ సాధునాదముల్
పీడని లేతతీవ కొసవిచ్చిన తెల్లనిపూల వాసనల్
కూడి విచిత్ర మోహమునకున్ ఎద ప్రేరకముల్ వికీర్ణముల్.

చీకటి, దప్పి, ఆకలి రచించినదెవ్వరో? ఒక్కపొదులో
నే కలిపించినారు, కనులుజ్జ్వలితమ్మగు వాడుకూడ వాం
ఛాకృషితోహుడై వెలుగు చాళ్ళల తప్పచరించు, ధైర్యులై
చీకటులాదిశాంతముగ చిన్నరి పృథ్వి సమాక్రమించెడిన్

ఈ తనువందు ఎచ్చటనో ఎచ్చటనోగల పేశలమ్ము త్వ
గ్జాతికణమ్ము లొక్కపరి చక్కిలిగింతకు పుల్కరించు, ఆ
రీతి హృదంతరమ్మున స్ఫురించినగాథము దుఃఖమల్లుకో
గా తలమున్కలౌను పులకల్ హృదిమార్దవ సీమలందునన్.

ఆత్మ శీలమునకు అర్థము తెలియని నాగరకతలేలు నాకులందు
మాయపెంచుకోని మమకారమెరుగని కనులనీటి మనసు మనుటకలదొ?

ఒక దుఃఖమ్ము సమాక్రమించి సుఖమందున్మత్త వాంఛాస్పృహన్
ప్రకటించున్, ఒకపూర్వ సంస్మృతి యెదో భావాను మర్యాదమై
వికసింపన్, సుఖవాంఛ జీర్ణమయి ఆస్ఫీతస్ఫురల్ శోకమై
అకృతేహాసుఖమై మనస్సు సకలోహాము క్తసంచారమై.

చేవై జీవితమెల్ల గాయములచే చీకాకుగా, విద్యుదా
హా దైన్యంబున విశ్వమెల్లచెడి హాహాకారముల్ విచ్చుకో
గా దీపింపని స్వర్గమార్గములు, విశ్వమ్మెల్ల దుఃఖాబ్ధిమై
ఈ దుఃఖమ్ముల కంతులేదు హృదయమ్మే చీకటిందావిమై.

పూలలో వాసనల్ పొంగినట్లున్న ఆనందిని కన్నులముందు తోచి
అందని కోరికలందించి, సుఖమన్న అవధికి తనసేవలవధిగాగ
వేదనాశీలి జీవితమార్గమందామె యైనను సుఖభావ మమరునట్లు
చేయలే, దాతని జీవనమెల్లయు శోక శీధూన్మత్తమై కనుల చి
వరల చిరుతరగల అశ్రుఝురులు ఇరుల పొరలు ఎదగాయముల
సెలపుట్టుటలును
అమృతమును పోయునెప్పుడో ఆత్మశీలి అతని జీవితమానందమై నిలబడు.

# మొండిగోడ

కయివకొలను సదానంద

సంవత్సరానికోసారి సంక్రాంతి. అంటే ఎప్పటికోగాని రాదన్నమాట! పరమశివం పంతులుగారి మొహంలో నవ్వు కనిపించడం కూడా అరుదు.

ఆయన నవ్వడానికి కారణమేమిటో నాకు లీలగా స్ఫురించింది. శిష్యోత్తముడను సహోపాధ్యాయుడుగామారాను. పరిస్థితుల ప్రాబల్యంచేత మారావలసివచ్చింది. ఆ పరిస్థితులేమిటో యిక్కడ తెలియజేసుకోవడం అప్రస్తుతం. కాని ఒకసంగతి— కుటుంబనిర్వహణ ప్రతివానికి పాలిట వంశ పారంపర్యమయిన బాధ్యత. తల్లిదండ్రులు, తోబుట్టువులు మొదలయిన రక్తబంధువుల పోషణభారం ప్రతివానికి తప్పదు. ఆ బాధ్యతను నా నెత్తిమీదనుంచి నెట్టివేయలేక పోయాను.

కష్టపడతనంచేత [illegible] బెల్లం తిన్నాను. బూర్జ్యసత్తులతో వేళ్ళు పెగ్గొట్టుకున్నాను. ఆలస్యంగా వచ్చి గోడకుర్చీలు వేశాను. ఎప్పుడో కుర్ర చేష్టలు పెట్టినందుకు— పరమశివం పంతులు నన్ను కోదండం వేయించడం నాకిప్పటికీ ఒక పెద్ద కలలాగుంది. అనుభవంలో ముఖ్యమయిన పెద్ద యిప్పుడీవిధంగా సమాన స్థాయిలో కూర్చుని మాట్లాడుతూంటే నాకేసిగ్గువేసింది.

"సంపాదన పనుల విద్యార్థులకోయ్ సుధాకరం!... నేను చెప్పిన చదువు నీ ఒంటబట్టు పవిత్రానికే పగ్గమెందన్న మాట!..." ఊసాను భూమి వచనాలకు అర్థమేమిటో నాకుత్వరగా బోధపడింది కాదు. నేను ఊహించుకున్న విషయం ఇది—బడిపంతుళ్ళ బ్రతుకులు బహుళ మోతవంటివి. చాలీచాలని వేతనం, ఈసిళ్ళపుట్టలా సంతానం, తీరనిఆశలు, నెరవేరని ఆశయాలు, అంతూపొంతూ లేని అవసరాలు; నెనువెంటనే మనోసందేహంకూడా కలక్కపోలేదు. స్వల్ప వేతనం, అధికసంతానం ఆశలూ, ఆశయాలూ, అవసరాలు పంతుళ్ళకేగాని ఇతరులెవ్వరికీ లేవా? ప్రత్యేకించి పంతుళ్ళ కష్టాలనే గుర్తించగలగడం, వారిమీద సానుభూతి చూపడం ఇతరులపట్ల అన్యాయం కాదా?...... "నువ్వొక్కడివే వచ్చావేమిటోయ్?... పెళ్లాం, పిల్లలూ..." అంటూ ఆప్యాయతతో నన్నడిగారు పరమశివంగారు నవ్వుతూ. "అలాంటి బాదరబందీ ఏమీ లేదండీ. పెళ్ళిచేసుకోలేదింకా — అమ్మనూ, చెల్లాయిన్నీ త్వరలోనే తీసుకొద్దామనుకుంటున్నా." అప్పటికే స్కూలంతా శూన్యంగావుంది. పిల్లలంతా వెళ్ళిపోయారు. సాయంత్రపు ఎండ తరగతిగది ముందున్న పసుపు మొక్కలమీదపడి పచ్చగా మెరుస్తూ కళ్ళకుమిరుమిట్లు గొలుపుతోంది.

"ఇక వెళ్దాంపద సుధాకరం!" అన్నారు పంతులు, కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత. పెట్టె, బెడ్డింగుతో పైకిలేచాను. కిటికీ తెక్కలుమూసి, తలుపులుతాళంవేశారు, పరమశివం పంతులుగారు. గేటుదాటుకొంటూ, మొండిబారిపోయిన ప్రహారీగోడలకేసి శూన్యంగాచూశారు.

"చూశావోయ్ సుధాకరం? ఈ మొండిగోడ ఎందరు భిక్షగాళ్లకు, ఎంతమంది అనాథలకు, ఎన్నిరకాల ఆస్తులకు ఆశ్రయమిస్తోందో— కాని దాని స్థితిచూడు...అంతా చివుడుబారిపోయి, మన్నురాలుతోంది. ఇప్పుడో రేపో కూలిపోయేట్లు నిరాశగానిలబడి దైన్యాన్ని చాటుతోంది." అతని కన్నులు చెమర్చడం గుర్తించాను. "నేనెక్కడున్నా ఈ వుపమానం నాకంట బడుతూనే వుంటుంది. బడిలోవుంటే బడిచుట్టూ మొండిగోడలు, యింట్లోకూర్చుంటే-యింటిముందు మొండిగోడలు. అలాకాదని యింకెక్కడి కయినా వెళ్తే-అక్కడ మొండిగోడలు... ఎక్కడచూసినా నన్ను వెక్కిరించే మొండిగోడలు, నాబ్రతుకు చుట్టూరా కన్పించే మొండిగోడలు..." ఉద్రేకంతో అతనిమాటలు ఆగిపోయాయి. నేను చూస్తానన్న ఆదుర్దాతో చిరుక్కున కండువాతో కన్నులొత్తుకున్నాడు. "నన్నుపిచ్చివాడనుకుంటున్నావా సుధాకరం? నువ్వే కాదు, అందరూ అనుకొంటారు. 'పాపం!... పిచ్చిపంతులు' అలాసానుభూతి చూపించడం కన్న-వాళ్లుచేయగలిగిందేమీలేదు. కాని-వాళ్లునన్ను పిచ్చివాడు అన్నందుకు నాకు చాలబాధవేస్తుంది. నేను పిచ్చివాణ్ణా?... కాను!—ఈక్షణంలో... నేను పిచ్చివాడైపోతే నాకు అంతకన్న సంతోషకరమైన విషయం మరొకటుండదు. పిచ్చివాడు, పిచ్చివాడు అంటారేకాని - వాడికివున్నంత ఆనందం మరొకడికి వుండదు. నాకు ఆ ఆనందం పిసరంతైనా లేదు. బడిలో-వున్మత్తుడిలా వుంటాను. బడివిడిస్తే-గుండెల్లో ఏదోదిగులు; సముద్రంలాంటి సంసారం కంటబడగానే గుండెలు అవిసిపోతాయి. సన్యాసం పుచ్చుకోవడం తప్ప వేరేతరుణోపాయం కన్పించదు. కానీ-సన్యసించలేకపోవడమే నాలోని బలహీనత..."

కొన్ని గజాలదూరంలో మొండిగోడలు కనిపించాయి. అతనిముఖాన్ని పరిశీలించాను. తాత్కాలికంగా నేనాక-రూపాల్లోనూ భేదం లేదు. శిథిలావశేష్యంలాగుంది అతనివదనం. ముడతలు పడినచర్మం, తీరని ఆశలనుద్యోతకం చేసే నయనాలు, సంసారభారంచేత కండ చివికిపోయి శల్యమాత్రంగా వున్న మెడ, వీపుకు అంటుకుపోయినట్లున్న రొమ్ములు, ముఖమంతా వార్ధక్యపు రేఖలు... ఆదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులను తెరమీద నవయౌవనవంతులుగా చూపించే చలనచిత్ర కళాకారులను పరిహసించడానికి పరమశివం

పంతులుగారి అవతారం ఎంతైనాతగును. తృతీయనేత్రం ఒకటేలోటట. సకలచరాచరాలు సర్వేశ్వరుని సంతానం. పరమశివంగారిది అటువంటి సంతానమేమీ కాకపోయినా సృష్టిసంతానానికి ఒక చిన్ననమూనా అనిపింపజేసేదిగానైనా వుండాలి.

మొండిగోడలు దగ్గర పడగానే పరమశివంగారు తేరుకొని— "అదిపోనీ లేవోయ్. ఏదో అసమర్థతతో పిచ్చిపిచ్చిగా వాగేస్తుంటాను. ఇదిగో! ఇదే మేముండేకొంప. ఎలావుంది? బావున్నట్టేకదూ?..."అన్నారు. ఆ యింటిని చూడగానే కొన్ని ఊహావీచికలు నాలో రేగాయి......కాళరాత్రి! చిమ్మచీకటి!... కన్నులుకనిపించడం లేదు... వర్షం మహోధృతంగా కురుస్తోంది. గాలిదుమారం లేస్తోంది. ఇంటిలోపల పడుకొని నిద్రపోతున్నాను. పైకప్పులు లేచిపోతున్నాయి... ఉన్నట్లుండి కూలిపోయింది యిల్లు!... ఆ యింటిలో నేను! నామీద గోడలు విరుచుకు పడ్డాయి. నేను కనిపించడం లేదు! అయ్యో! మట్టిలో కూరుకుపోయాను! నేనేమయ్యాను? ...నాగతి... శరీరం కంపించింది. నేననుకున్నంత పెద్దవర్షంకూడా అనవసరం. చిన్న సుడిగాలికికూడా కొట్టుకుపోతుందేమోనన్న అనుమానం వేస్తుంది ఆయింటినిచూస్తే. కాని— అదికొన్ని ప్రాణాలకు ఆశ్రయాన్నివ్వగలుగుతోంది. మానవసేవా భాగ్యంకోసమేనన్నట్లు యింకానిలబడివుంది.

పెంకుటిల్లు. ఆ ఇల్లేమీ అంతపెద్దది కాదు. పిల్లలుఆడుకునే బొమ్మరింటిని జ్ఞప్తికి తెస్తుంది. వంటగది, చిన్నహాలు, బయట నడవ—యింతేదాని పరిమాణం. ఈ వివిధ భాగాలన్నీ సూక్ష్మపరిమాణంలోనివే! గది అని ఏదీప్రత్యేకింప బడలేదు. ఇంటితో ఏమాత్రం సంబంధంలేకుండా, ప్రత్యేకంగా బోనులాంటి చిన్నగది ఒకటుంది. అందులో మునుపు యింటియజమానులు కట్టెలు, విస్తరాకులు జాగ్రత్త పరచుకునేవారట. ఇప్పుడది పరమశివంగారి కుటుంబానికి గదిగా ఉపయోగపడుతోంది. పరమశివంగారు గబగబ ఆగదిని ఖాళీచేయించి నాకిప్పించారు. పెట్టె, బెడ్డింగూ అందులోపడవేసి, కొంతభారం తగ్గినట్లు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను.

నన్ను ఎక్కువగా విస్మయచకితుణ్ణి చేసిన విషయమేమిటంటే— పరమశివంగారి కుటుంబ విస్తీర్ణం ఎంతమాత్రం తగ్గకపోవడం. నడవలో ఉయ్యాలలో నిద్రపోతున్న పసికందును చూడగానే నేను పొందిన ఆశ్చర్యం అంతాయింతా కాదు. ముసలి దంపతులకు పసిపాపలెక్కడనుంచి పుట్టుకొచ్చారు? భగవంతుడుగానీ ప్రత్యక్షమై—"వత్సా! ఈ చూతఫలాన్ని మీభార్యా భర్తలిరువురును సమాన భాగంబులుజేసి భుజియించిన పక్షంబున మీ యభీష్టంబు సిద్ధించు"నని వరమిచ్చి యింటినిండుకూ మామిడిపండ్లనేమైనా కురిపించ లేదుగదా? ...ఊహాతప్పు! బడిపంతుళ్లకు సంతానంకోసం తపస్సులు చేయవలసిన

నులేమో వున్నై!" అంటూ నిట్టూర్పు విగి
డించాను. "ఒరే అబ్బాయ్! నీకుఒక రూపా
యియిస్తాను!..." అర్థంకాక వింటున్నాను.
"ఇప్పుడు మనవూళ్లో భారతం జరుగుతోంది.
ఔనా?..." "ఔను!" "నీకు ఒక్కరూపా
యియిస్తే నువ్వేమగా ఎక్కడికి వెళ్తావు?
...భారతానికి. కదూ?..." "ఔను!"
"వెళ్లి ఏంచేస్తావ్? ఫరవాలేదు చెప్పు ––"
"వెళ్తాను. ఓబేడయిచ్చి కాగంశనగలు కొను
క్కుంటాను. ఓఅణాయిచ్చి గాలిబుడగ తీసు
కుంటాను. సాయంత్రిందాకా రంగులరాట్నం
లో తిరుగుతాను––" "ఇంకా?...ఇంకా?..
లాటరీలు! డబ్బిబొళ్లిస్తాగే, ఆ ఆటః...
చింతపిచ్చేలాట...యివన్నీ చూస్తావుకదూ?
"ఊ...వు...ను" "అంటే నీయిష్టంగా
ను ఖర్చు చేస్తావన్నమాట. ఆ రూపాయి
అయిపోయేంతవరకు నువ్వు నిద్రపోవు. దీన్నే
విలాస జీవితం అంటారు. ఈ విలాస జీవితా
నికి అలవాటు పడ్డవాళ్లకు––ముందు వెనుకలు
తెలీవు. బాగా అనుభవించడం. ఆనందించడం!
ఆనందించడం––అంతే! అంతా కరిగిపోయి.
యిల్లుగుల్లైపోతే అప్పుడు మాత్రం పశ్చాత్తా
పపడటం! చేతులు కాలింతర్వాత ఆకులు
పట్టుకోవడమంటే యిదే! మా పెద్దలందరూ
అలాచేయబట్టే–యిప్పుడు మాకన్ని తిప్పలు."

బాగా అర్థమైంది. విలాసపు వాసనలు
పసిమనస్సంగాడిలోనూ కనిపిస్తాయి. జీతం
చేతికి అందగానే–కోటాయుగా నిలబనీయదు అ
తనిమోడ. రాకీలివ్వవలసిన వాళ్లకు అరా
పాతికా యిచ్చి, కంటికి కనిపించిన వంతా
కొనేస్తాడు. ఆ కొనే వస్తువులు నాలుగు
రోజులు మన్నేవీకావు. అన్నీ తినదగినవే.
తాటిముంజెలు కనిపిస్తే అనోవందయినా
కొనేస్తాడు. మామిడిపండ్ల బుట్టలు యింట్లోకి
వెళ్లిపోవలసిందే. చిలగడదుంపలమ్ముతూంటే
అనో నాలుగ్గైదువీశెలు తీసుకోవలసిందే.
ఎండనీకు ఉంకాయలు ఏంజేసుకోను? అదొక
ఏడ్తైకాయలుకొని యింట్లో వేసుకున్నదొక
సారి. ఒంటికి చలవట!... మంచి ఆరోగ్య
మట... మెదడుకు శాంతమట!––పిల్లలు ఆ
కాయలన్నీ పెటీల్ పెటీల్ మని పగులగొట్టి,
సుష్టుగా తాగి, చేతకొబ్బరఆరగించి, సాయం
కాలానికల్లా చిప్పలు ఎండబెట్టేశారు. ప్రతి
దీఅంతే!...ఉన్నన్నాళ్లూ పండుగ, లేనినాడు
"ఎందుకు పుట్టించావురా భగవంతుడా?"
అంటూ నెత్తిమీద చేతులెట్టుకొని కూర్చో
డం–ఈ రెండే అతని చిరానుభవాలు.

జీతం చేతికందిన మొదటిరోజుల్లో
ను తనజేబు గునుపుగాపుంటుంది. అందులో
అరవైనాలుగు కాసులైనా వుంటాయి. ఆతని
పిల్లలకు ఆ జేబు ఒక బ్యాంకి. రెండుమూడు
రోజులకంతా ఆ బ్యాంకు దివాలా తీసేస్తుంది.
వరుస ఇంటి ప్రక్కనున్న చెంగయ్య శ్రేష్ఠి
గారు – యిరాపుసగారి సంతానాన్ని చూసి
అసూయజెందింది, "ఆయ్యో పాపిష్టి దేవుడా! నీ
కెన్ని పూజలు చేశాను, ఎన్ని వ్రతాలుచేశాను,
ఎన్ని అభిషేకాలు చేశాను, ఎన్నితీర్థయాత్రలు

చేశాను...నాకివ్వకూడదా ఒక్క కొడుకుని? బంగారు త్రాసులోవుంచి తూచుకునేవాడినే" అంటూ సంతాప పడుతూంటే విన్నివున్నాను నొకసారి. అతని సంతాన విహీనతపట్ల నాకు జాలికలుగక పోలేదు. కాని, ఎందుకనవ్వా కున్నానంటే-ఆతని మొరల్లో ప్రతివాక్యం చూడండి. పూజలుచేశాట్ట, వ్రతాలుచేశాట్ట, అభిషేకాలుచేశాట్ట! తీర్థయాత్రిలుచేశాట్ట.. "ఎన్ని చలిపందిళ్లు వేయించాను!-కరువు కాలంలో ఓపనిమంద్కి నా గంజిపోశాను! ...ధర్మసత్రాలు కట్టించకపోయినా, ఒక్క సమారాధ్యనైనాచేశాను..." అనకూడదా? ...బిడ్డలు లేనప్పుడు తోడిమానవులే తన బిడ్డలు అని ఎందుకనుకోలేక పోయాడో దురదృష్టవంతుడు!... కాని - భగవద్భాషణలో నేనూ అతనికి పుట్టలు పుట్టలుగాపుట్టించి, పోషించుకోగలిగిన వాడికి ఒక్క పట్టినయినా ప్రసాదించకపోవడం న్యాయమేనట్రా లోకనాథా?" అంటినిబో-అది శ్రేష్ఠిగారిపట్ల సానుభూతి చూపించినట్లవుతుంది. నా సానుభూతి పరమశివంగారికి చెందాలిగనుక- "పోషించుకోగలసమర్థునికి ఒక్క పట్టినయినా తగులుగట్టక పోషించుకోలేని అసమర్థునికి పుట్టలు పుట్టలుగా పుట్టించి విడిపించడం ఎంతఘోరమనుకున్నావురా, అనాథరక్షకా!" అనుకున్నాను.

నేను స్కూల్ ఫైనలు చదువుతూండగా పంతులుగారు మావూరునుంచి బదిలీ అయిపోయారు. అతను వెళ్లిపోయేటప్పుడు అతనితోపాటు తరలిపోయినవి - పుట్టెడుసంతానం, తట్టెడు దారిద్ర్యం. బ్రతుకలేక బడి పంతులంటారు. రెండేళ్లపాటు పుద్యోగం దొరక్క ఉపాధ్యాయుడుగా శిక్షణపొంది, నూతనోపాధ్యాయుడుగా, అందులోపంతులుగారికి సహోపాధ్యాయుడుగా—మళ్లీ ఈనాడతను కంటబడ్డారు. నా మస్తిష్కంలో సుడులు రేగుతోన్న ఆలోచనా వీచికలలో- బాహ్యావాతావరణంలోని నిశ్శబ్దతను గానీ, సంచలనాన్నిగానీ గుర్తించ లేకపోయాను. కాలవనీటిలోని 'గలగల'లా బయలుదేరిన ఒక సంభాషణ నా ఆలోచనల్ని భంగంచేసింది. అది 'పార్వతీ పరమేశ్వరుల' యిష్టాగోష్టి.

"మరింకేముంది? అబ్బాయి చూడ్డానికేమో చక్కగానేవున్నాడు. చదువూవుంది. ఉద్యోగముంది. కాబట్టి పెళ్లాన్ని పోషించుకోలేకపోడు. ఈడుజోడూ బాగుంటుంది. మన అంతస్తుకు యినుముంచి సంబంధమే. దాని పెళ్లి అలాజరిగిపోతే..."

"అదికాదే! అబ్బాయి మంచి తెలివిమంతుడే! వృద్ధిలోకిరావలసినవాడు. అతని తల్లి అతనిమీద ఎన్ని ఆశలు పెట్టుకుందో ఏమో?...తనవెంబడే "లక్ష్మి"ని వెంటబెట్టుకొచ్చే కోడలు దొరకవచ్చుగా! అటువంటి అవకాశం వున్నప్పుడు ముష్టివాళ్లం-మనతో వియ్యానికి ఒప్పుకుంటారా?..."

"కూటికితక్కువైనా కులానికి తక్కువ వాళ్లమా? వంశ మర్యాదలలో ఏమైనా

లోపమా?...అట్టహాసం. ఆడంబరం లేకపోతే పోవచ్చుగానీ; మనల్ని గురించి వాళ్లకు మాత్రం తెలియనిదేముంటుంది? మీరింతన్నీ కదలించిచూడండి. ఆ తర్వాత మన అదృష్టం ఎలావుంటే అలాకానీ..."

"కానీ-ఇంకో ఆరు నెలలుండి, అది గడిచిపోనీ! అప్పటికి సరస్వతికి ట్రెయినింగు పూర్తయిపోతుంది. తర్వాత అదినాలుగు రాళ్లు సంపాదించుకోగలిగితే-ఎవరో ఒకరు కట్నాలవ్వాసెత్తకుండానే కట్టుకుంటారు. ఈ లోపల నేనుప్పుడైనా సుధాకరంతో, అతని తల్లితో ఈవిషయం ప్రస్తావించి చూస్తాను."

ఇదేమిటి?... కోడిపిల్లను లక్ష్యంగా వుంచుకొని, ఆకాశంలో చక్రాలుతిరిగే గ్రద్ద కుమల్లే పిల్లా, పిల్లప్రద్దేశాలు! ప్రథమ వీక్షణంతోనే ప్రవరుణ్ణే వరించేసిందట వరూధిని! కాని-నేను తొలిచూపుతో అన్యుణ్ణే ఎంచుకునే వాడు. సరస్వతి—మనో నేత్రం ముందు మెదిలింది. అందమైన ముఖం; అమాయికత్వం వుట్టిపడే చూపులు; మా పెరట్లో మల్లెపూవులను జ్ఞప్తికి తెచ్చేనవ్వు; కొత్తపరికిణీకేసి చూస్తే సిగ్గుతో బిగుసుకుపోయేకళ్లు...ఆ సరస్వతి యిప్పుడేలావుంటుందో? వన్నెలు చిన్నెలు కూర్చుకుని, పాదుగట్టి పెంచిన పూలమొక్కలా కట్టుదిట్టంగా వుంటుందేమో!... సరస్వతిని గురించిన తలపులు, మనస్సును కళ్లెం వేసి ఆగని తీయని ఊహాలు మెదులుతుండగా ముసురుకున్నాయి.

మరునాడు ప్రత్యేకంగా అద్దెయింటి కోసం అన్వేషణసాగించి, సఫలీకృతుడనై, ఉద్యోగ జీవితంలోని కొత్తదనాన్ని అనుభూతిపొందుతూ స్కూల్లోకి వెళ్లాను. ఆపాఠశాలను గురించిన వివరాలంతా పరమశివంగారు నాకుచెప్పారు...నాతోకలిసి మొత్తం నలుగురు ఉపాధ్యాయులు. అందులో యిద్దరు సెలవుమీదవున్నారు. స్కూలు చివరిగంటలో పంతులుగారు పనిమీద బయటకెళ్తూ "గంట అయిపోగానే స్కూలు మూసుకునే సెయ్ సుధాకరం. కాస్తపనివుంది. అలా బయటికెళ్తా." అన్నారు. అతనలా వెళ్లినపదిహేను నిమిషాలకు టపా బంట్రోతు వచ్చి రెండు ఉత్తరాలిచ్చాడు. ఒకటికార్డు, మరొకటి కవరు. రెండు పరమశివంగారి పేరుతో వున్నాయి.

స్కూలు విడిచిపెట్టి, ఆవూళ్లో-మందు కొండలో మర్రిచెట్టుకావున్న ఒకచిన్న హోటలులో దూరాను... పరమశివంగార్ని బాధపెట్టి నేను బాధపడదలుచుకోలేదు.

భోజనం ముగించి, మొండిగోడలు దాటి, యింటికడప ఎక్కబోతుంటే-హెచ్చు గొంతుకతో పార్వతమ్మగారి ధుమధుమలు వినిపించాయి. "గాడిద వయస్సొచ్చి పనీ పాటా లేకుండా వుంటేఎలా? పగలంతా వూళ్లుదిరిగి, తిండివేళకు యింటికొస్తే-యిక్కడేమైనా పండివస్తోందా?--ఎన్నాళ్లిలా మేపగలం? ఈ కొంపనగాని బతుకు బతికిన ఎవరికి లాభం.?..." మరునిమిషం-యించుమించు

వూడిపడ్డాను. నెత్తిమోదుకుంటూ పార్వతమ్మ గోలుగోలున ఏడుస్తోంది. ఇంకాతడి ఆరని చేతులతో మడతవిప్పిన కాగితాన్ని పట్టుకొని హైమవతి ఖిన్నవదనంతో నిలుచుని వుంది. నిద్రబోతున్న శ్రీమతి లేచివచ్చి బిత్తరపోయిచూస్తోంది. పసిబిడ్డ హడలిపోయాడేమో-క్యారుమంటున్నాడు. నేలమీద ఖాళీ కవరుపడివుంది.

"అయ్యో నాకూతురా! నీకెలాంటి దుర్గతి పట్టిందేనాతల్లీ! ఉన్నచోటు తెలియని దానివి, నీకీదేంపాడుబుద్ధి పుట్టిందే పాడుదానా! ...నీబతుకూ, మాపరువూ అన్నీ మంటగలిసిపోయాయిగదే..." పార్వతమ్మ ఆగకుండా రాగాలు తీస్తోంది. విషయమేమీ అర్థంగాక నివ్వెరపడి నిల్చుండిపోయాను. అంతవరకూ ఎక్కడికో వెళ్ళివున్న పరమశివం గారు హడావుడిగా వస్తూ- "ఏమిటీగోల? ఏం జరిగింది?..."అన్నారు. "ఇంకేముంది? కొంప మునిగింది..." అని పార్వతమ్మ అనడమూ, హైమవతి-చేతిలోని కాగితం అందివ్వడమూ జరిగిపోయాయి. పంతులుగారికన్నులు కాగితంలోని పంక్తులవెంట పరుగులు తీశాయి.

ఆయనకళ్ళల్లో నిప్పులు కురిశాయి. కోపంతో పళ్ళు గిట్టకరచి, కాగితాన్ని కసికొద్దీ నలుపుతూ- "కులపాంసనురాలు! చెడబుట్టింది. నూతిలోదూకి చావలేకపోయింది. సిగ్గులేక జాబు వ్రాసింది. ఇప్పటికే సగం చచ్చినవాణ్ణి పూర్తిగా చంపేసింది. బతికుండగ యింత పాడుపనిచేసి యిందరిగోడు పోసుకోడానికన్నా, చచ్చిపోయి అందర్నీ సుఖపెట్టి వుండరాదూ?... నారక్తం పీల్చేశారు. నా మానమంతా కడిగేశారు. నావుసురు పోసుకుని మీరంతా ఏంసుఖపడిపోతారు?— నా గోడు మీకుతగిలి తీరుతుంది...మీరు నరకానికి పోతారు?..." అతనికోపం క్రమంగా ఏడుపులోకిమారింది. పిచ్చివాడిలా జుట్టు పీక్కున్నాడు. చొక్కా చింపుకున్నాడు. జేబులోనుంచి రెండు పదిరూపాయిల కాగితాలుతీసి విసరికొట్టాడు. "తీసుకోండి... దానికి పంపుదామని చచ్చిచెడి తెచ్చాను. అదితనని తాను చంపుకుంది. నన్ను చంపేసింది. నామీద కట్టెలు పేర్చి నిప్పుపెట్టేయండి...."

వినగా వినగా నాకు తెలిసిన విషయమేమిటంటే. ఎక్కడో—సెకండరీ గ్రేడు ట్రెయినింగుస్కూల్లో సరస్వతి చదువుతోంది. అదిఆమె పొరపాటో, ప్రారబ్ధమో—కాలు జారింది. పరిస్థితి విషమించింది. నలుగుర్లో నవ్వుమాటవుతానని భయపడింది. తనగుట్టు ఎక్కడ బట్టబయలవుతుందోనని సందేహించింది. చివరికి ఆమెసందేహం రూఢీఅయింది. ఎంతదాచిపెట్టినా దాగలేదు. పాఠశాలాధికారులామెను స్కూల్లోనుంచి తొలగించారు. ఆమె యింటికి రాలేకపోయింది. తల్లిదండ్రులకు ముఖం చూపలేకపోయింది. విషయమంతా తెలియజేస్తూ జాబువ్రాసింది. అందులో-యిక తనబ్రతుకు ఒక సమస్యకాదనీ-తాను బ్రతికినా చచ్చినట్టే లెక్క అని.

కనుక తనని చచ్చినట్టుగానే భావించుకోవల సిందనీ–రాసింది.

మధ్యాహ్నంపూట పరమశివంగారు స్కూలుకురాలేదు. స్కూలుకే కాదు. గుమ్మంలోంచైనా బయటికి తొంగిచూడలేదు. ఆరాత్రింతా పంతులుగారికి విపరీతమైన జ్వరంకాచింది.... "నేనువెళ్లిపోతా. మీరు ఏ ఏట్లోనయినాపొండి మీరుపడితేనాకేం?. మీకూ నాకూ సంబంధం లేదు...." అని జ్వరంలో ఏమేమో కలవరించాట్ట. మనసు నాటికి హృదయంకూడా జీవచ్ఛవంలా నిశ్చేతనంగాపడివున్నాడు. అతని మీద అందరి ఆశలూ సన్నగిల్లి పోయాయి. అతనియింట్లో –భయంకర నిశ్శబ్దం నెలకొన్నది. మధ్యాహ్నం మళ్లీ ఓసారి వెళ్లాను. పంతులు లేచి కూర్చునివున్నాడు. సుధాకరం.... ఈ నికృష్టుడు అప్పుడేచావడు. వీడుచస్తేకొన్ని ప్రాణాలు "అయ్యో లక్ష్మణా!" అంటూ అల్లాడి పోతాయి... ఇకమీదట ఏకష్టమూ నన్ను గోరంతైనా కదలించలేదు. అటువంటప్పుడు కష్టాలకి భయపడి ఎందుకుచచ్చిపోవాలి?.." సుడిగాలికి చెక్కుచెదరని గండశిలలావుంది అతని ముఖం.

...... దూరంగా మండుటెండలో మొండగోడ. దానినీడలో ముడుచుకు పడుకున్న కొన్ని కుక్కపిల్లలు.

# సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర

"శతక్రతువు"

సమగ్రమైన ఆంధ్ర సాహిత్య చరిత్ర ఇంత వరకు వ్రాయబడలేదు. కీ. శే. కందుకూరి వీరేశలింగముగారి 'ఆంధ్రకవుల చరిత్ర' మొదలు కీ.శే. చాగంటి శేషయ్యగారి 'ఆంధ్రకవి తరంగిణి' వరకు ప్రధానముగా సాగినది కవుల చరిత్రయే. సాహిత్య చరిత్ర సకృన్మాత్రము. ఆ కవుల చరిత్రను గూర్చి పునః పరిశోధన యావశ్యకము. కనుక సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర మొకటి అపేక్షితము. సాహిత్య అకాడమీవంటిసంస్థకిది కర్తవ్యము. విశ్వవిద్యాలయము లకును విహితము. విహితమైన కృత్యమిది తలపెట్టిన మద్రాసువిశ్వవిద్యాలయము ఎంతైనను ప్రశంసార్హము. కానిమద్రాసు విశ్వవిద్యాలయమువారి ప్రయత్నమునకు ఆశించిన ప్రయోజనము కలుగలేదు. అందుకు హేతువు ఆ ప్రయత్నమునకు ఫలములైన గ్రంథములే. ఆ గ్రంథములు మూడు.

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము:- రచయిత శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. గ్రంథనామమునుబట్టి ఈ గ్రంథమున ఏతత్సారస్వత చరిత్ర పరిణామము పరామర్శింపబడి యుండుననెడి యూహ కలుగుచున్నది. కాని గ్రంథస్థ విషయమునుబట్టి చూడగా అట్టి పరిణామ చరిత్రకాని, వివిధసారస్వత ప్రక్రియల సామాన్య విశిష్ట లక్షణములుకాని, కావ్య విమర్శలుకాని కానవచ్చుట లేదు. 1933 లో ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిచే ప్రచురింపబడిన తంజావూరు మహారాజావారి సరస్వతీమహల్ లైబ్రరీలోని తెలుగు వ్రాతప్రతుల కేటలాగులోని రచనా ప్రణాళికయే యిందనుసరింపబడి యున్నది. అనుసరింపబడి యుండుటయేగాక అందలి విషయముకూడ సుమారు అరువదియైదు పుటలవరకున్నదున్నట్లుగా ఇందు చేర్పబడినది. ఇతర పండితులు విమర్శింపనట్టియు, పరిశోధింపనట్టియు, గ్రంథములనుగూర్చిన విమర్శ యేమాత్రమును నిందు కానరాదు. విశ్వవిద్యాలయ ముద్రతో ప్రామాణిక రచనముగ ప్రకటితమయిన గ్రంథమున పలువిధములగు దోషము లుండుట విచారకరము.

2. తెనుగుకవుల చరిత్ర:-- రచయిత శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు. ఇదిసుమారు నాలుగు వందల పుటల గ్రంథము. ఇందు రమారమి రెండు వందల డెబ్బది పుటలవరకు క్రీ. శ. 848-1237 మధ్య గల శాసనకవుల విషయము, ఆ శాసనముల యుదాహరణములు గలవు. ఈ విషయము కీ. శే. జయంతి రామయ్య పంతులుగారి శాసన పద్యమంజరి లోనిది. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము వట్టి కేటలాగువలె తెనుగు కవుల చరిత్ర చాలవరకు శాసనముల సంపుటము. మిగిలిన నూటముప్పది పుటలలోను కవిశబ్దవాచ్యులు నలుగురైదుగురు కలరు. కవుల కాలనిర్ణయముకూడ సరిగాలేదు.

3. ఆంధ్ర వాఙ్మయచరిత్ర సర్వస్వము రచయిత శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు. వీరు ఆంధ్ర విశ్వకళా పరిషత్పరిశోధక సువర్ణ పతక పరిగృహీత. ఇది సుమారు ఎనిమిదివందల పుటల గ్రంథము. నన్నయ మొదలు నాచన సోమనాథునివరకు ఇందు శాసనముల మతలబులూ, శాసనకవుల జాబితాలు

పర్యాప్తము కాకపోవుట ప్రథమతః ప్రశంసార్హము తదుపరి గ్రంథమందంతట ప్రశంసార్హములయిన అంశములు ప్రాయికముగ అనేకము కలవుకాని వాని మరుగుపరచు విషయములు అత్యధికముగ నుండుట శోచనీయము.

ఆంధ్రభాషయందు సాహిత్యసారస్వత వాఙ్మయశబ్దములు పర్యాయ పదములుగా వాడబడుచున్న వనియు "నన్నయాది పూర్వకవులు వాఙ్మయశబ్దమును వాడుటచే దానినే వాడుట యుక్తము" అనియు గ్రంథకర్తగారు వ్రాసినారు. ఈ రెండవ వాక్యమునకు ఇచ్చిన లక్ష్యములలోని నన్నయభట్టు వాఙ్మయ శబ్ద ప్రయోగములు రెండును గ్రంథకర్త భావించిన అర్థమునలేవు. "నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుడు" అను నన్నయభట్టు ప్రయోగము నకు నారాయణభట్టు సాహిత్యవేత్త అని మాత్రమే అర్థముకాదు. కావ్యశాస్త్రోభయ వాఙ్మయవేత్త అని అర్థము. "వేదాది సమస్త వాఙ్మయములందు" అను ప్రయోగమున సమస్త వాఙ్మయములలో శాస్త్ర గ్రంథములును గతార్థము. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునందలి "పరాశరాత్మజ మునీంద్రునివాఙ్మయము" అనగా వ్యాసుడు వ్రాసినది సాహిత్యమనియే కాదు. వేదములు మొదలు అష్టాదశ పురాణములును వ్యాసుని వాఙ్మయమే. పురాణములకంటె భిన్నములు కావ్యములు. కావ్యవాఙ్మయమే సాహిత్యము. "విజ్ఞానాత్మక వాఙ్మయమున" అనుస్థలమునకూడ వాఙ్మయ శబ్దార్థము సాహిత్య మాత్రముకాదు. సాహిత్య మాత్రమైన కవిత్వ విషయము ఆదే పద్యమున అన్యథా లేదు. "అప్రతిమాద్భుతోభయకవిత్వప్రౌఢ శబ్దప్రయోగాజ్ఞాన సిద్ధి ఘనుండు" అని అనగా నిట వాఙ్మయశబ్దార్థము సాహిత్యేతరమే. నృసింహపురాణము 112 లోని "వినుతించు వాఙ్మయధ్వనులు" అనుచోట వాక్యతోయాచిన ధ్వనులు అని సామాన్యార్థమే కాని సాహిత్యాదిక విశేషార్థమే క్లిష్టము. 140 పద్యము లోని "ధర్మవాఙ్మయ" శబ్దమునకు ధర్మసాహిత్యమని అర్థము కాదుకదా! ఇక 191 పద్యములోని వాఙ్మయశబ్దమునకు, కేతన ప్రయోగమునకు సాహిత్యమూలార్థము కలదు. ఏతదర్థమున సాహిత్య శబ్దమే ఆంధ్ర గ్రంథములందు రూఢము. "కవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢ సాహిత్యముల్" అని శ్రీనాథుని ప్రయోగము. అంతేకాదు,

"ద్వివిధమయ్యె గావ్యమవని సంగీత సా
హిత్య సంజ్ఞలను మహేంద్రవంద్య".

"ఘరసాహిత్యము___" అని లాక్షణికుడు అప్పకవి నిర్ణయము. కనుక వాఙ్మయ శబ్దముకంటె సాహిత్య శబ్దమువాడుట ఉత్తమ మనుటయే ఉత్తమ పక్షము. ఈ శబ్దవ్యవహార మటుంచి ఈగ్రంథమున విపరీత సిద్ధాంతము లనేకములు కలవు. కొన్నింటిని సూచించెదను.

1. "కుంతకుడు వక్రోక్తి కావ్యమునకు ప్రాణమనియు క్షేమేంద్రుడు 'ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవిత'మ్మనియు దెలిపిరి. కాని చివర ఆనంద వర్ధనుడు 'కావ్యస్యాత్మా ధ్వని' యని స్థాపించెను."

కుంతక క్షేమేంద్రుల తరువాత ఆనంద వర్ధనుడు 'కావ్యస్యాత్మాధ్వని' యని స్థాపించ లేదు. ముందే ఆనంద వర్ధనుడు కావ్యస్యాత్మాధ్వని అని స్థాపించగా అట్లు కాదని వక్రోక్తి కావ్యమునకు ప్రాణమని ధ్వని సిద్ధాంతమును ఖండించినవాడు కుంతకుడు. ఇక క్షేమేంద్రుని ఔచిత్య సిద్ధాంతము నకు ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతము ఆధారమే. ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునకు అభినవగుప్తులు ఆలోకము వ్రాసిన తరువాత మహిమభట్టు, కుంతకుడు ప్రత్యామ్నాయ సిద్ధాంతములు ప్రతిపాదించిన వారు. అభినవ గుప్తునికి మహిమభట్టు సమకాలికుడును, కుంతకుడు కించిదర్వాచీనుడును కాదగును. కుంతకునికంటెఅర్వాచీనుడు క్షేమేంద్రుడు. శాస్త్రకారుల

పౌర్వాపర్యమైన గ్రంథగర్తగారు పరిశీలించలేదని దీనివలన స్పష్టమగు చున్నది.

2. "నన్నయ దృష్టిలో కవిత్వము లేదా కావ్యము, మనోహరమైన కథతోగూడుకొనిన చమత్కార భావములను, రమణీయమైన శబ్దజాలముతో గూర్చుటయని పై పద్యమునుబట్టి గోచరించు చున్నది." పుట 7.

పైపద్యమనగా "సారమతింగవీంద్రులు ప్రసన్నకథా కలితార్థ యుక్తి లోనారసిమేలునా—' అన్న పద్యము. ఆ పద్యమునుబట్టి ఎవరికయినను యిట్లు గోచరించుట చిత్రము. ప్రసన్నకథ అనగా మనోహరమైన కథయనియు అర్థయుక్తి అనగా చమత్కార భావములనియు ఎట్లుగోచరించును? 'కలితార్థయుక్తి' అనుపాఠమునకు 'కవితార్థయుక్తి' అని పాఠాంతరము గలదు. పాఠాంతర పరిశీలనముచేసి సుష్ఠుపాఠము నిర్ణయించి ఈ పద్యమునకు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు సలక్ష్యముగా సరియైన అర్థమును వివరించుట సాహిత్య జగత్తునకు పరిచిత పూర్వము. ఆ అర్థనిర్ణయము సరియైనది కాదను అభిప్రాయము కలదేని సరియైన అర్థనిర్ణయముచేయుట కర్తవ్యము. ఆ ప్రయత్నమీ గ్రంథమునందులేదు. ప్రసన్నకథకు మనోహరకథ అనియు అర్థయుక్తి యనగా చమత్కార భావములని చెప్పుట సమంజసముకాదు.

ఇట్లు పరామర్శ సాగించిన, వ్యాసము పరిమాణమున తద్విగుణీకృత గ్రంథమగుట తథ్యము. కనుక పీఠికలోని ముఖ్యమయిన యొకటిరెండు ప్రతిపాదనలు గ్రంథమునందెట్లు సంపదించినవి, ఎంత సమంజసములైనవి, పరిశీలించుటమాత్రము ప్రకృతోపయోగము.

1. "ఒకానొక కవియొక్క కవితా లక్షణములను నిర్ణయించుట కొకటిరెండు పద్యముల నక్కడక్కడివి యుదాహరించిన జాలవు. వివిధ రసమయ సన్నివేశములను పరిశీలించినగాని యథార్థము తేలదు.... కాన కం. వీరేశలింగంగారివలె నొకటి రెండు పద్యములమాత్ర మొసగక చిన్నచిన్న రసమయ సన్నివేశముల నాయా గ్రంథములనుండి గ్రహించినవాని నెల్ల నొసగవలసి వచ్చినది....వాఙ్మయ చరిత్రయందు సరియైన కావ్య విమర్శ చేయకుండుట లోపమని చెప్పకతప్పదు. కాన నాలోపమును తీర్చుటకై లక్ష్య లక్షణ సమన్వయముతో విపులముగా కావ్యవిమర్శ వివిధ విషయములను బురస్కరించుకొని చేయవలసి వచ్చినది." పుటలు xii, xiii.

కవితా లక్షణములను నిర్ణయించుటకు ఒకటి రెండు పద్యములు చాలనిమాట నిజము. కాని నిర్ణయించిన కవితా లక్షణములను నిర్దేశించుటకుగాను ఘట్టములకు ఘట్టముల ఉట్టంకింపులు ఎందులకు? అందును ప్రసిద్ధగ్రంథములనుండి కేవలము అనవసరము. కవులచరిత్ర రచనా ప్రణాళికకు సాహిత్య విమర్శాదికము క్వాచిత్కమే. అట్లు క్వాచిత్కము గాక అత్యధికప్రపంచనము లక్ష్యమైన సాహిత్య చరిత్రలకును ప్రసిద్ధ గ్రంథములనుండి పునరుద్ధరణము పుటపూరణమాత్ర ప్రయోజనము. అది గ్రంథకర్తగారికి స్వమతము. ఈ స్వమతము కూడ సరిగా పాటింపబడలేదు. తిక్కన ప్రకరణమున బహువాచక పుస్తకములందు కనిపించు లుబ్ధకపోతోపాఖ్యానము వినా విరాటోద్యోగ పర్వములనుదాటి ఒక్క రసమయ సన్నివేశమును ఒసగలేదు. "తిక్కన వీరరౌద్ర రసములనెట్లు పోషించెనో కనుగొందము" అని (పుట 439) "తిక్కనార్యుడు భయానకరసము నెట్లు ప్రతిపాదించెనో చూతము" అని (441) తిక్కన యుద్ధవర్ణనలను తిలకింతము," అని (441) ఒసగినవి విరాటోద్యోగ పర్వవిషయములే. యుద్ధవర్ణనంకైన యుద్ధపంచకమునుండి ఒక్క 'చిన్న రసమయ సన్నివేశము' నైన ఉదాహరించలేదు.

ఇక నన్నయభట్టు ప్రకరణమునందు ఉదాహరించిన రసమయ సన్నివేశములివి:- 1. బకాసుర వధ ఘట్టములోని భాగము. 2. సౌగంధికాహరణ ఘట్టములోని భాగము. 3. ఇంద్రప్రస్థ వర్ణన. 4. మయసభా వర్ణన. ఇందు మొదటి రెండును సంభాషణ శైలికి ఉదాహరణలు. ఇది మరి కవితాలక్షణములు నిర్ణయించుటకు ఒసంగవలసి వచ్చినవి. మరి పీఠికా ప్రవచనానుసారము నన్నయ ప్రకరణములో కావ్య విమర్శ యేమిటన్నది ప్రశ్న. ఉపమాద్యలంకారముల ఉదాహరణైక పద్యములు, ప్రకృతివర్ణనలు, స్త్రీ వర్ణనలు, భాషా జాతీయములు, ఛందస్సు "సీతాపతిగారి సీ. గీ. ల పట్టిక " వగయిరా కావ్య విమర్శ !

నన్నయ భారతము వ్యాసభారతమునకు ఆంధ్రీకరణ విధానమొక అత్యవసర కావ్య విమర్శా విషయము. తదుపరి నన్నయ్య తానుగా తన కావ్యమును గురించి చెప్పికొన్న లక్షణమునకు లక్ష్యసమన్వయము ముఖ్యమైన కావ్య విమర్శా విషయము. ఈ గ్రంధమున నన్నయ భారతాంధ్రీకరణమును గురించి ఒక పరిచ్ఛేదము కలదు. (పుట 173). ఒక్క శ్లోకమునకయిన ఒకటి రెండు అనువాద పద్యములయిన ఒసగలేదు. పైగా "వ్యాస భారతమును ముక్కకుముక్క భాషాంతరీకరణము చేయక ప్రసన్నకథా కలితార్థయుక్తి ప్రధానముగా రచించినాడు." అని ఒక ప్రతిపాదన కలదు. ఆ ప్రసన్నకథా కలితార్థ యుక్తికి కనీసము అర్థ వివరణయైన లేదు.

ఇక నన్నయభట్టు ప్రకరణమున రస చర్చయేలేదు. ఇతర ప్రకరణములలోని రౌద్రరసోదాహరణాదికము రసచర్చకాదు. మరి నన్నయభట్టు భారతమున రసములేదని గ్రంథకర్తగారి అభిప్రాయమేమో ! నన్నయ్యకు రసదృష్టిలేదని వ్రాయలేదు కాని కావ్యకళాదృష్టిలేదని వ్రాయకపోలేదు. నన్నయకు కావ్యకళాదృష్టిలేదు కాని వైదికదృష్టికలదట. మరి తిక్కన్నకు వైదిక దృష్టిలేదా? తిక్కన నియోగి యగును గాక. వ్యాస భారతమవైదిక గ్రంథము కాదే! నన్నయ వైదికదృష్టి అను పరిచ్ఛేదమున 'నన్నయ పూర్వమీమాంసా మతావలంబి' అనియొక అవాంతరప్రతిపాదన కలదు. అదట్లుంచి పూర్వాంధ్ర సాహిత్యమున శివకవులో, వైష్ణవకవులో తప్ప వైదిక దృష్టిలేని కవులెవరు? శివకవులకు శిఖరాయమాణుడయిన పాల్కురికి సోమనాధుడు వీరశైవమునకు వైదికముద్ర వేసినాడుకదా ! ఒక్క నన్నయ్యకే వైదికదృష్టి కలదేని అందుకు మరి అన్యథా నిర్బాధకములైన ఉదాహరణము లొసగుట అవసరము. అంతేకాదు. 'కం. వీరేశలింగముగారి వలెగాక' ?. రామకృష్ణశాస్త్రిగారు లక్షణమును నిర్ణయించుటకు చిన్నచిన్న వైదికదృష్టిమయ సన్నివేశములొసగ వలసిన అవసరముకూడ కలదు. ఐనను నన్నయ వైదికదృష్టి 'లక్షణమును నిర్ణయించుటకు' మూడుపద్యములకంటె ముచ్చటించినదిలేదు.

ఇక స్త్రీ వర్ణనలు ఇతోధిక విశేషము. ఈ గ్రంధమున ఇది అపూర్వ విషయము. యిందుకు ప్రథమతః ఈక్రింది ప్రతిపాదనలు గమనార్హములు.

1. "భారతకవుల స్త్రీవర్ణనలో శుచిసౌందర్యములు నిత్య సంయోగములుగ నున్నవి (?)........ ఆపాద మస్తకము స్త్రీవర్ణన నన్నయ ఎక్కడను జేయడు. అనాగరక వర్ణనమును, అసభ్యవర్ణనమును స్త్రీలపట్ల మందుకైన నొనర్పడు." (పు. 199).

2. "నన్నెచోడకవి యొక్క పార్వతీ వర్ణనమునే వివిధ రీతుల వివిధ స్థలములలోజేసి తన ప్రౌఢత్వమును బ్రకటించెను. మొట్టమొదట పార్వతి హిమవంతునింట పెరుగుచున్నప్పు డాపాదమస్తకము నుత్ప్రేక్షలతో సాంకేతిక పద్ధతిలో వర్ణింపబడినది. తరువాత సప్తర్షులు పార్వతిని జూచివచ్చి శివునితో వర్ణించుట తిక్కన వర్ణనలరీతి నుండుటచే నాతనికే

యాతడు దారి చూపినాడనిపించును." పు. 304.
3. "ఆకర్షణీయముగ తేజోవంతమైన స్త్రీ విగ్రహమును కండ్లకు కట్టినట్లుగా నన్నయ్య ఇందు చిత్రించినాడు. కాని ప్రబంధకవులవలె నాపాదమస్తకమును నీచముగ వర్ణనలు చేయలేదు. (నన్నయ తపతీ సంవరణోపాఖ్యానమునందలి భాగము ఉదాహృతము) ఈ సమయమున (తిక్కన కీచక మోహఘట్టము ఉదాహృతము) ప్రబంధములందలి నాయికా నాయకుల ప్రథమ సమావేశమునగల్గు భావములన్నియు విభావానుభావ సాత్త్విక వ్యభిచారీభావముల(?)తో నొప్పుచు ప్రపంచింపబడినవి. ... .ఇట్లు తిక్కన వివిధభావముల విస్తరించి విశాలపరచుటకు విశేషముగ నవకాశమిచ్చి ఈ రసమయ సన్నివేశము హృదయమున ముద్రితమగునట్లు చేయును".

నన్నయ స్త్రీవర్ణన ఆపాదమస్తకము చేయడని ప్రశంస. నన్నయ వర్ణించిన స్త్రీలందరు దేవతాస్త్రీలు కారు. దేవతా స్త్రీలను ఆపాదమస్తకముగను మానవ స్త్రీలను ఆమస్తకపాదముగను వర్ణించుట కవుల సంప్రదాయము. ప్రత్యంగ వర్ణనములని. గ్రంథకర్త భావమేమో! ప్రబంధకవులవలె నీచముగ ప్రత్యంగ వర్ణనము చేయకపోవుట నన్నయ ప్రత్యేకత. చేయుట నన్నెచోడుని ప్రత్యేకత. జగన్మాత పార్వతిని ఆపాదమస్తకముగను అతివేలముగను వర్ణించుట నన్నెచోడుని ప్రౌఢత్వము! అట్లు వర్ణించుట ప్రబంధ కవుల నైచ్యము! నన్నెచోడుని కుమార సంభవమునందు తృతీయాశ్వాసములో 45, 46, 47 పద్యములు అనుచిత వర్ణనలు. 48 వ పద్యము దారుణమైన అశ్లీల వర్ణన. సప్తర్షుల పార్వతీ వర్ణనలో 14, 15 పద్యము (అష్టమాశ్వాసము)లనుచిత వర్ణనలు. అసలు నన్నెచోడుని అనేక వర్ణనలు అతివేలములు. అందు విటీ విటగోష్ఠి వర్ణన పరాకాష్ఠ. అంతకంటె "నీచపుగు వర్ణనలు" ప్రబంధకవులందు విరళము.

తిక్కన కీచక మోహఘట్టమున నీచపుగు వర్ణనకు పరాకాష్ఠ విరాటపర్వము ద్వితీయాశ్వాసములోని 310 పద్యము. అయినను కీచకమోహఘట్టము 'రసమయ సన్నివేశము' అని గ్రంథకర్త ప్రతిపాదనము. కీచక మోహఘట్టము రసమయ సన్నివేశము కాదు. రసాభాస సన్నివేశము. ఇట్టి సన్నివేశమునందలి కీచకుని మనోవికారములు 'ప్రబంధములందలి నాయికా నాయకుల ప్రథమ సమావేశమునగల్గు భావములు' అనికూడ గ్రంథకర్త అభిప్రాయము. ద్రౌపది నాయిక, కీచకుడు నాయకుడు అని కాబోలు వారి అభిప్రాయము. పాపము శమించుగాక! ద్రౌపది నాయికయే. నాయకుడు ధర్మరాజు. నాయక ప్రయోజ్యుడు భీముడు. కీచకుడు ప్రతినాయకుడు. మొత్తము కీచకవధ ఘట్టమున అంగిరసము రౌద్రము ఏతద్రస పరిజ్ఞానము కలదేని కీచకుని మనోవికారములు 'విభావానుభావ సాత్త్విక వ్యభిచారీ భావములతో నొప్పుచు ప్రపంచింపబడినవి." అనుట జరుగదు. ఇట వ్యభిచారీ భావములనుట ఇంకొక తప్పు. కీచకవధ ఘట్టమున అంగిరసము రౌద్రమని చెప్పబడినది. అందుకు కీచకుని మోహపారవశ్యాదికము అంగరసముగు శృంగారాభాసము. అది మరి అంగిరసమునకు ఉపస్కారకమగుట రసప్రయోజనము. ఏతత్ప్రయోజనముగల అంగరసము అంగిరసము కంటె అతిశయించుట రసానౌచిత్యము. తిక్కన కీచకవధ ఘట్టమున ఆ రసానౌచిత్యము కలదు కనుకనే ఆ ఘట్టము శృంగారరసాఖండమని భ్రమించు దుస్థితి ఏర్పడినది. తిక్కన మహాభారతమున ఇతరత్ర అంతట మహాకవి అగుగాక! ఈ ఘట్టమున సామాన్యుడే అనక తప్పదు. అంగాంగి భావములేని అతివేలరస ప్రపంచనము మహాకవి శబ్దమాన్యుడు చేసినను రసానౌచిత్యమే. తిక్కన కీచకవధ ఘట్టమిందుకు ప్రథమోదాహరణము. అట్టిది 'రసమయ సన్నివేశము' అనుట విస్మయ జనకము. పారదారిక శృంగార ప్రవణత్వముకల ప్రతినాయకునికి మనోవికారములు ప్రబంధగత నాయికానాయక ప్రథమ సమావేశ భావసదృశములనుట అక్షంతవ్యము.

(సశేషము)

దట. ఆస్త్రీ "ఉపాధ్యాయా? మీకూతురుకు బహువచనములుకూడ చెప్పుచుంటిరా!" అని అడిగిందట. ఇలాంటిశంక తెలుగువాళ్లకు పుట్టుతుందా? నీమనస్సులోనే వేఆలోచించుకో అని మనం రోజూ అనమా? అవతలివానికి మనస్సులో కాకపోతే మరిదేనిలో ఆలోచిస్తాననుకొంటున్నావు అని అడగాలని తోచదు. వాడూ తెలుగువాడే కాబట్టి.

పక్షపాతమంటే ఇదే. ఒకసిద్ధాంతాన్ని అవలంబించి మరొక సిద్ధాంతాన్ని వ్యతిరేకించటం పక్షపాతంకాదు. ఏసిద్ధాంతావలంబకుల్లోనైనా కొన్ని ప్రాథమిక విషయాల్లో అభిప్రాయభేదం ఉండదు. నాకన్నులతో చూచాను, నానోటితో చెప్పాను. ఒక్క తెలుగేకాదు. సర్వభాషలలో ఇటువంటి ప్రయోగాలున్నవన్నది ప్రాథమికజ్ఞానము. నిరంతర వాగ్వ్యమద్వర్ణ ద్వేష విషజ్వాలా వికటాననుల కది అనవసరమైన విషయం కావచ్చును.

తెలుగుదేశంలో విమర్శకోక ప్రమాణం లేదంటే ఇదే. ఒకవ్యవస్థ లేదంటే ఇదే.

—సప్తర్షి

## ఆకాశవాణి

భారతకథను మద్రాసుకేంద్రం గుత్త కొన్నట్టున్నది—అని కొన్నాళ్లక్రితం వ్రాశాను. మళ్లీ ఇప్పుడూ వ్రాస్తున్నాను, అది స్థిరమైన విషయం కనుక.

గయోపాఖ్యానమున్నది. ఇదిభారతంలోకథకాదు. అయినా సర్వభారత ప్రధాన పాత్రలకు ఇందులో ప్రాధాన్యం ఉంది.

కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు దీనిని నాటకంగావ్రాశారు. దానికి దేశంలో అద్భుతమైన ఆదరణ కలిగిందికూడా. అంత చక్కటినాటకానికి సరిగ్గా వ్యతిరేక దిశలో "మాటపట్టింపు" అనే నాటిక ఉంది. "మాటపట్టింపు" లోకథ గయోపాఖ్యానమే. అంతకథ 40 నిమిషాలలో ఒకేరంగంలో పూర్తయింది. ఈకథనే "కృష్ణార్జునులయుద్ధం" అనటంకూడా ఉంది. ఎందుకంటే ఆకథలో వాళ్లిద్దరూ యుద్ధం చేసుకుంటారు. ఈ"మాటపట్టింపు"ను బట్టిదాన్ని "కృష్ణార్జునులమాటలు" అని మార్చుకోవచ్చు. కాదంటే "పంచపాండవుల నవ్వులు" అన్నా అనవచ్చు. దానికి కారణం ఈ నాటకంలో ఉట్టిమాటలు, అనవసరమైనవి కృతకపుసవ్వాలు తప్ప ఇంకేమీ లేవు. అంటే యుద్ధం అసలే లేదన్నమాట. (మనం శాంతికాముకులం కదా!). ఇక పాత్రలు ... ఈ నాటికార్జునుడు భారతార్జునునికి వ్యతిరేకంగా అన్నగారిని ఎదిరిస్తాడు. ధర్మరాజుగారు—ఎల్లాగూ శాంతపురుషుడే కాబట్టి—ధర్మపన్నాలు మాత్రమే వల్లించు "పౌరుష" వంతుడైనాడు. కృష్ణునిపై అతనికి వచ్చిన కోపం పేదకోపమే. భీమబలరాములు గొంతు

చించుకు నవ్వడానికి, ఆసంతోషంలో ప్రక్కవాళ్ల వీపులు చరచి చంపినంత పనిచేయడానికీ తప్ప ఎందుకూ లేదు. చివర భీముడి "సంతోషదెబ్బ" తో గయుడు మూర్ఛపోయినంత పనైతే సహదేవాదులు ఆయన్ని తేర్చుతారు... "భీమన్నా"–"అర్జున్నా" అనే పిలుచుకోవడాలూ, "నన్ను గయుడుగారంటారు" అనే అసంప్రదాయకోక్తులూ, వ్యర్థవీరప్రేలాపాలూ ఆకథనీ పాత్రల్నీ బజారుకులాగాయి. అన్నట్టు ఇది వీథిమార్గసియుగంకదా! ఇందు లోయుగం బింబించిందన్నమాట... ఈ "మాటపట్టింపు" ఏడాది పొడగునా ప్రతిజ్ఞలు చేయనివారికి అంకితం చేయబడింది. ఆచేసిన నాటికాకర్త, నిర్వాహకులు ఆమంచర్ల గోపాలరావుగారు. దాన్ని 19 ఏప్రిల్ న ప్రసారం చేసింది మద్రాసు కేంద్రం. ఎందుకు చేయదు? వర్ణించేవాళ్ళు మనవాళ్ళేకదా!

వర్ణించేవాడు మనవాడే అంటే మరేం ఆశ్చర్యపడనక్కరలేదు. 'వాణి' ఒకటి చెపుతుంది. వర్ణించేవాడు ఇంకొకటి వర్ణిస్తాడు. ఏప్రిల్ 18వ రాత్రి 9-30 మద్రాసు ప్రసారం చేసే 'మాట పట్టింపు'ని విజయవాడ హైదరాబాదులు ప్రసారం చేస్తాయని వాణి చెపుతుంది. తీరా ఆనాటిక మనసును ఫిరాయించిన విజయవాడ అదే వేళకు వింజమూరి శివరామారావుగారి "ఏకవీర" నాటికను ప్రసారం చేస్తుంది. (ఆనాటిక ఇదివరకు ప్రసారమైందే. దాన్ని గూర్చి వ్రాయబడిందికూడా) 'మాటపట్టింపు' 40 నిమిషాలు. "ఏకవీర" ఒకగంట. ఆ "ఏకవీర" మీద విజయవాడకి అంత అభిమానం ఉంటే 10-10నుండి ప్రసారం చేయవచ్చు. ఈసమయంలో ప్రారంభమయ్యే ప్రసారం 'ప్రకటింపబడును" అంటుందివాణి. ఏదీ?– ఆప్రకటించే బాధ్యత కూడా వదలుకుంది విజయవాడ, అనుకున్న మద్రాసును అవతలకు తోసింది. తమ "ఏకవీర"ను దగ్గరకు తీసింది. వర్ణనంటే ఇది.

మధ్య వర్ణన వచ్చింది. ఇది వదలితే మద్రాసులో నేరికార్డుచేయబడిన, హైదరాబాదునుండి ఏప్రిల్ 3న ప్రసారం చేయబడిన మహాభారతనాటిక "ముల్లోకాలు". ముల్లోకాలు అంటే స్వర్గమర్త్య పాతాళాలు కాదు మర్త్యస్వర్గ నరకాలు. స్వర్గారోహణపర్వ గాథ. దీన్ని ప్రసారకులు "చిత్రసంగీతనాటకం" అన్నారు. దీనిభావమేమి తిరుమలేశ! నిజానికిది వీథి భాగవతంలాగా ఉంది... మూడు లోకాలను తన ఆత్మలో చూచుకోవడం మహాప్రస్థానం అన్నట్లయితే, ఇందులో ధర్మరాజు తానే మూడులోకాల ఆత్మలదగ్గరికెళ్లి చూడడం, పైనున్న దానికన్నా చిత్రంగదూ!... ఈమధ్య సంగీత నాటికలు అతిగా ప్రసారమవుతున్నాయి. సంగీతవైవిధ్యం లేదు, సాంగీతిక వైవిధ్యం తప్ప. తమ సంగీతానికే తమ అనుకరణ, తమవారిదానికే తమ అనుకరణ. ఆ సంగీతం బాగాఉందని నల్గురన్నారు. క్రొత్త బాణీలకెందుకు ప్రయత్నించడం? వ్యర్థశ్రమ–కానివ్వు, అన్నట్టుగాఉంది. నారాయణరెడ్డిగారి "రామప్ప" కృష్ణశాస్త్రిగారి "వసంతోత్సవం", వేటూరి ఆనందమూర్తిగారి "రసాలము"

అయ్యగారి విశ్వేశ్వరరావుగారి "ముల్లోకాలు", ఇవన్నీ సరిగ్గావింటే "పాడిందేపాట... గా" అనిపిస్తుంది. ఇటొక మగ గుంపు, అటొక ఆడ గుంపు, ఇదొక అర్థచరణం ఆదొక అర్థ చరణం, చివరకు రెండు కలిసి వెరసి పూర్తి చరణం అనడం, ఇది అన్నిటా సాధారణమైన విషయం.

ఉగాది నుద్దేశించి వివిధ కార్యక్రమాల్లో ప్రసారం చేసిన సంగీత నాటికల్లో కథ చెప్పే మెలకువలవల్ల "రసాలము" బాగా ఉంది. కాకపోతే అందులో రసాలం మాత్రం లేదు. ఉగాదినాడు కృష్ణశాస్త్రిగారి నాటిక(?)లు— "ఋతు చక్రము" మద్రాసునుంచి, "వసంతోత్సవం" హైదరాబాదు నుంచీ ప్రసారమైనాయి. మొదటిది జానపద బాణీలలో ఉన్న అభ్యుదయాభ్యుదయ గేయ సంపుటి. రెండవది అసంపూర్ణంగా భాసించే నాటిక "వాణి"లో ఇది అచ్చయింది. కాకపోతే, అచ్చయిన వరుస వేరు, ప్రసారమైన వరుస వేరు. ఆకాశానికీ, వాణికీ ఈ చుక్కెదు రెండుకో తెలియదు.

సంగీత నాటికల ప్రస్తావన కాబట్టి ఒక విషయం చెబుతాను. నాల్గు అయిదు కృతులను పాడించి, దాన్ని "సంగీత నాటిక అనుకో"మని మద్రాసు, విజయవాడలు మహత్ప్రయత్నం చేసి చెపుతున్నాయి. క్షేత్రయ్యను గూర్చి ఋతు చక్రాన్ని గూర్చి మద్రాసు చేస్తే, విజయవాడ దానికి సమ ఉజ్జీగా "ఎవరని నిర్ణయించేదిరా"ను గూర్చి చేసింది. ఒకరోజు వ్యవధానంగా ఏప్రిల్ 3, 5 లలో విజయవాడ, మద్రాసులు "కామాక్షి" "రామకథాసుధ" మళ్లీ అదే విధంగా ప్రసారం చేసాయి. శ్రోతల్ని ఇంత మభ్యపెట్టేయత్నం ఎందుకు?... ఒకవేళ ఇవి ఉట్టి వ్యవహారార్థ మాత్ర నాటికలేమో. "ఆకాశవాణి అభ్యుదయాలంకారశాస్త్ర" నిర్మాణం జరుగుతుందేమో ఇకముందు. "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ." ఏది జరగ గూడదు?

జాతీయ రూపక కార్యక్రమములో ఏప్రిల్ 14 న ప్రసారమైన "భామాకలాపం" ఒక్కటే చెప్పకుండా బాగున్నది.

యథాపూర్వకంగా ఆకాశవాణి నాలు నాటక సప్తాహం నిర్వహించారు. ఇందులో నాల్గువంతులు అనువాదాలు. కొన్ని అనుసరణాలు. కొన్ని స్వతంత్రాలు. అనువాదమైనా బాగున్నది "దీపశిఖ" (లత), స్వతంత్రంగా బాగుంది "ఆత్మవంచన" (బుచ్చిబాబు). ఐతే నిర్వహణలోని లోపాల విషయం మరచిపోవాలి. అంతే... మరి ఈ సప్తాహం విజయవాడ, హైదరాబాదులే నిర్వహించాయి. మద్రాసుకిందులో భాగంలేదు. మద్రాసులో ఆంధ్రులు లేనట్లు, అక్కడ నాటకాలు రాసే వాళ్లు, ఆడేవాళ్లు అంతకన్నా లేనట్లు... ఈ లేనట్టు ఒక్క ఈ సప్తాహ విషయంలోనే కాదు. 5వ ఆకాశవాణి సాహిత్య సమారోహంలో కూడా. మద్రాసు "బి" కేంద్రం

స్థితి చాలా విచిత్రంగా ఉంది. అటు తమిళ కేంద్రంకాదు. ఇటు తెలుగు కేంద్రమూ కాదు. అందువల్ల అటు తమిళమూ దూరం తోసి, ఇటు తెలుగూ దూరంతోస్తే, అర్థనారీశ్వరత్వం ఆ "బి" కి అబ్బింది.

17వ ఏప్రిల్‌న విజయవాడ నుండి ప్రసారమైన ఈ "సమాలోచన" కార్యక్రమంలో పింగళి లక్ష్మీకాంతంగారు, బందా కనకలింగేశ్వరరావుగారు విజయవాడ తరఫునుండి, కృష్ణశాస్త్రిగారు, స్థానం నరసింహారావుగారు హైదరాబాదు తరఫునుండి పాల్గొన్నారు. మద్రాసు "బి" పూర్తిగా తెలుగు కేంద్రం కాకున్నా సగమైనా అవును కాబట్టి కనీసం ఒక్కరినైనా అక్కడి ఉద్యోగిని తీసుకుంటే ఏమయ్యేది. పంక్తిలో పక్షపాతమా?... ఈ ప్రసారంలో బందా వారు "నాటకంలో ఇంత నాటకం" అనే హాస్యరచన వినిపించారు. ఇద్దరు స్నేహితుల్లో కూర్చొని మాట్లాడుకుంటే బాగుండి, పదిమంది వినడానికి ప్రసారం చేసేందుకు బాగా ఉండని విషయం ద్వారా కూడా హాస్యం కల్పించబడింది. కృష్ణశాస్త్రిగారు వ్రాసింది వారి చదవడంకన్నా బాగుంది. అయితే చదవడమే బాగున్న ప్రసంగం స్థానం వారిది... 15వ తేదీన ప్రసారమైన ఇదే కార్యక్రమంలో నిడదవోలు వెంకటరావుగారి గత ముప్ఫైయేండ్ల వచన రచనా సమీక్షా వ్యాసమూ, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "నాగార్జునకొండ" అన్న విషయాత్మక రచన చాలా బాగున్నాయి. నిడదవోలువారు ముప్ఫయేండ్ల వచన రచనా సమీక్ష చేస్తే, 13న "గద్యభారతి" పేర తెలికచెర్ల వెంకటరత్నంగారి "గడచిన శతవర్షాలలో తెలుగు వచనాభివృద్ధి చిత్రించు రూపకం" ప్రసారమైంది. ఇందులో "చిత్రించడం" ఉన్నా, వ్యక్తుల్నిగూర్చిన తీవ్ర వాక్యాలూ, గ్రాంథిక రచనా విషయంలో వ్యతిరేకతా స్పష్టమవుతాయి. ఇది రూపకం కాదు, సమీక్ష. సమీక్షలో ఇవన్నీ ఉండడం బాగుండదు. అయితే తెలికచెర్లవారు వ్యావహారిక భాషావాదాల్లో మునిగి తేలిన వ్యక్తి. వారు అల్లా "చిత్రించడం" మాత్రం ఆశ్చర్యకరం కాదు.

—సామిరి

## గ్రంథ సమీక్ష

### శ్రీ మధుర భాగవతము

రచయిత: శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

ముద్రాపకులు:
ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి.
వెల అయిదు రూపాయలు.

"వ్రాసిన రామాయణం వ్రాయడ మెందుకు? వ్రాసిన భాగవతమే ఎందుకు వ్రాయడం?" ఇత్యాది ప్రశ్నలు ఈరోజుల్లో అధికం. కాని "వ్రాసిన ప్రేయసినిగూర్చే వ్రాయడ మెందుకు? వ్రాసిన ఆకలినిగూర్చే ఎందుకు వ్రాయడం?" ఇత్యాది ప్రశ్నలు కలుగడంలేదు. ఎందుకు కలగడంలేదో అర్థంకావడం లేదు. పూర్వీయ విషయాలను నిరసించడం ఒక

సరదా కావచ్చు ...రచయితయొక్క శక్తి ప్రతిభలను బట్టి విషయం నిత్యనూతనంగా ఉంటుందన్న విషయం తెలియకపోతే అనరదా కలుగవచ్చు. ప్రతిరచయితకూ రచన చేయడంలో ఒక్కొక్క ప్రత్యేక కారణం ఉంటూ ఉంటుంది. ఆ కారణాన్ని పురస్కరించుకొని రచన సాగిస్తాడు. తన లక్ష్యనిర్వహణకు ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నంలోని సాఫల్య, అసాఫల్యాలనుబట్టి ఆయా రచనలకు ఆదరణ లభ్యమవుతూవుంటుంది. శక్తిమంతుడయిన వానిచేతిలో అద్భుతంగా మలచబడిన వస్తువే శక్తిహీనుని చేతిలో భ్రష్టమై పోతుంది. రచన కవియొక్క శక్తిని తెలుపుతుందేతప్ప విషయం కాదు తెల్పేది.

శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు పరమ భాగవతంలోని ఏకాదశ ద్వాదశస్కంధాల రచనకు పూనుకొన్నారు. దానికి ప్రత్యేకమైన ఆశయంఉంది. క్షత్రియ భారతం తరువాత తెలుగుదేశంలో పోతన గారి భాగవతానికి లభించినంత ఆదరం మరేదానికి లభించలేదు. అట్లాంటి భాగవతం ఏకాదశ ద్వాదశ స్కంధాల దగ్గరికి వచ్చేప్పటికి అతః పూర్వభాగము కలిగించినంత ఆసక్తి, అనుభూతి కలిగించలేక పోతున్నది. దీనికి కారణం ఆ రెండు స్కంధాలు పోతనగారి రచనగాదు. పోతనగారి శిష్యుడు వెలిగందల నారయ్య వాటిని రచించాడు. ఆ రచన పోతనగారి రచనతో చేర్చతగినస్థాయి లోనిదిగా కన్పించదు. పైగా ఆ రెండు స్కంధాలలో అనేక వేదాంత సంబంధి విషయాలు కుప్పలుగా ఉన్నాయి. కథాదులను నిర్వహించడంలో కొంత సౌలభ్యం ఉండవచ్చునేమో కాని, ఈవిషయాలను నిర్వహించి పాఠకుని రంజింప జేయడం కష్టమైన పని. అందు కంటే ఈ విషయాలను నిర్వహించేందుకు ముఖ్యంగా సంప్రదాయ పరిజ్ఞానం అవసరమవుతుంది. విషయాన్ని పాఠకుని మనస్సుకు హత్తుకొనేట్లుగా చెప్ప

గలశైలి అవసరమవుతుంది. ఇన్ని చిక్కులు ఉండడంవల్లనే కావచ్చు. నారయ్య ఆ రెండు స్కంధాలను అతిగా సంక్షిప్తీకరించి అనేక విషయాలను వదిలేశాడు. 31 అధ్యాయాలతో 1373 శ్లోకాలతో ఉన్న ఏకాదశ స్కంధం నారయ్యచేత 123 గద్యపద్యాలతో పూర్తి చేయబడింది. అధ్యాయాలకు అధ్యాయాలే చాలా వరకు వదిలిపేయ బడ్డవి. చాలా అధ్యాయాలు నామ మాత్రంగా స్పృశింపబడ్డాయి. చాలా విషయాలకు సమన్వయంకూడా కుదురదు. ఇవన్నీ జిజ్ఞాసువైన పాఠకునికి అసంతృప్తి కలిగించేవి. ఈ లోపాలన్నీ చూచి, స్వయంగా అనుభవించి శ్రీ శర్మగారు ఈ రెండు స్కంధాలను పునః రచించడానికి పూను కొన్నారు.

ఈ రెండు స్కంధాలలో అనేకమైన కథలు వేదాంతభావ బోధకంగా ఉన్నాయి. కథలేకాక పూర్తిగా వేదాంత సంబంధ విషయాలూ ఉన్నాయి. అనువాదం సందర్భంలో శర్మగారు సంక్షిప్తీకరించినట్లు కన్పించదు. కాని విస్తృతి పరచినస్థలాలు చాలా ఉన్నాయి. రెండుమూడు శ్లోకాల్లో మూలగతమైన కథను పది పదిహేను పద్యాల్లో అక్కడక్కడా పెంచారు. ఈ పెంచిన స్థలాలను గమనిస్తే, శర్మ గారి పూర్వసాహిత్యాధ్యయనంలోని గాఢత్వం గోచరిస్తుంది. "భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీకయా" అన్నవచనం శర్మగారి రచనలో సర్వథా సార్థకమై కనిపిస్తుంది. ప్రామాణికమైన బుద్ధితో, సంప్రదాయబద్ధమైన రచనతో, భావనతో శర్మగారు కూర్చిన 'ఉద్ధవగీత' నిమిజాయంతే సంవాదము మొదలైనవి ఆహ్లాదకరంగా ఉన్నవి. నిర్వేద ప్రధానమైన కపోతకథ, పింగళాగీతము, పురూరవోగాథ, మొదలైనవి విస్తృతములై పాఠకునికి విషయావగాహన కలిగిస్తవి. వేదాంత సంబంధ విషయాలు స్పష్టపరచడం కోసమై శర్మగారు అక్కడక్కడ

'పునరుక్తిని', కూడా లెక్కచేయకుండా రచన సాగించినారు. ఇది ఉద్దేశ్యపూర్వకంగానే చేసినట్టు కనిపిస్తుంది.

పోతనగారు రచించకుండా వదిలిన భాగాన్ని అనువదించడం జరిగింది. కాబట్టి పోతనగారి శైలి యొక్క ముద్ర స్పష్టంగా గోచరిస్తుంది. పోతనగారి రచనకు ప్రత్యేకత నాపాదించిన అంత్యప్రాసలు ఈ రచనలో ప్రముఖంగా గోచరించవు. కాని సంవాద రూపమైన రచన అనేకచోట్ల గోచరిస్తుంది. "ఈ పదాబ్జముగదే యిందిరాసుందరీమణి దేహతాపంబు మాయజేయు" అన్నది "ఈ చరణంబులే యిందు నిభానన సనకాది మునియోగ సంసేవనొప్పు" అన్న పోతనగారి పద్యానికి సంవాదరూపకంగా కనిపిస్తుంది. "ఎవ్వాని ప్రోత్ఫితామేత్రీక్షణంబులు సహార్యముల్ కుసుకుసలాడిపోవు" అన్నది "ఎవ్వని యంకె పర్ణేంద్రియంబుల సోక గర్వపాటంబగు గర్భిణులకు" అన్న దానికీన్నీ సంవాదం. "బాలకుఁ గుక్షిస్థ జగజ్జాలకు. ఫాలపల నత్యుత్తాలి యుపిర నీలాలకు, సుదతి బరచ్చిన మాలకు, గనులాంగనె రమాపాలకునిన్" అన్నది అచ్చంగా పోతనగారి రచననే స్ఫురింపచేస్తుంది.

శర్మగారి రచనలో జాతీయములు, సామెతలు మాండలికములు విరివిగా ఉపయోగించబడ్డవి. ఈ జాతీయములు, సామెతలు పాఠకునికి విషయంతో సన్నిహితనాన్నీ, ఆసక్తినీ కలిగిస్తవి. అయితే మాండలికములు కొన్నిచోట్ల మర్యాదంగానూ, కొన్నిచోట్ల అన్యమాండలికులకు దుర్గ్రాహ్యంగాను పరిగించేవిగానూ ఉన్నవి.

ఇంతే కాక అక్కడక్కడా ప్రయోగింపబడ్డ అత్యాధునికమైన 'రోడ్డు' 'చీట్లపేక' వంటి పదాలు ఆ యా విషయకాలాదులకు నప్పినట్టుగా, ఉచితమైనవిగా గోచరించవు. ఆనాటి మిథిలానగరంలోని పింగళ అన్న వేశ్య చీట్లపేక ప్రస్తావన చేయడం సమంజసంగా అనిపించదు. 'అస్మత్ప్రాప్తి మొనయచేయునదే మార్గము. పదుగురుననెడి రోడ్డుగా దనఘాత్మా!' అన్నచోట 'రోడ్డు' పదప్రయోగంవల్ల విషయంలో పేలవదనం వస్తోంది . ఏకాదశ స్కంధం మొదటి పద్యంలోనే 'కేశవుని భక్తిభావము చే శుభ సంప్రాప్తికై భజింతునెడందన్' అన్నచోట 'చే' అన్న విభక్తి ప్రత్యయానికి మారుగా 'తో' అన్న ప్రత్యయం ఉండడమవసరమనిపిస్తుంది. 'చే, తో' అన్నవి రెండూ తృతీయా విభక్తి ప్రత్యయాలే అయినా, ఆయాసందర్భాన్నిబట్టి ఆయాప్రత్యేక ప్రత్యయాలను ప్రయోగించడం వల్లనే తెలుగులో అర్థస్ఫూర్తి కలుగుతుంది. 'బలుప'వంటి శ్లిష్టరచ్ఛవ రూపాలూ, 'అతసేసుమాతను' వంటి లక్షణ విరుద్ధ ప్రయోగాలూ అక్కడక్కడా కనుపిస్తవి. అయితే, ఈ అల్పలోపాలచేత పాఠకుడు ఆగిపోకుండా ముందుకు తీసుకుపోయే గుణం శర్మగారి రచనలో సర్వత్రా ఉంది.

ఎట్టులో ఏ భవంబుననో
  యేలవమో సుకృతంబు సేయ గ
న్పట్టె నృదేహమిద్ది చని
  నన్ వ్యధగా మఱి భావికాల పుం
బొట్టు మనుష్య దేహమన
  నొప్పునె? కావున దీవమున్న య
ప్పట్టున దేవులాడు మను
  పల్కు నెఱింగి హరిన్ భజింపుమా.

—సంపత్కుమార



# త్వరలోనే-మెట్రిక్ కొల పరిమాణాలు

రంగులు, పెట్రోలియం పరిశ్రమలు తమ కొలతలన్నీ ఏప్రిలు 1960 నుంచి మెట్రిక్ పద్ధతిలో కొనసాగిస్తున్నాయి.

అంటే మెట్రిక్ కొలపరిమాణమైన లీటరు ఉపయోగంలోనికి వచ్చిందన్నమాట. రంగులు లీటర్లలోనే అమ్ముతున్నారు; పెట్రోలు, కిరసనాయిలు మొ॥ వాటి సరఫరా యావత్తూ లీటర్లలోనే జరుగుతోంది.

**మారకపు పట్టీ**

**1 గాలను = సుమారు $4\frac{1}{2}$ లీటర్లు**

**1 లీటరు = 1,000 మిల్లీలీటర్లు**

| ద్రవ వస్తువులు ఔన్సు | మిల్లీలీటర్లు (మిలీ) (సుమారుగా) |
|---|---|
| 1 | 28 |
| 2 | 57 |
| 3 | 85 |
| 4 | 114 |
| 5 (=1 జిల్) | 142 |

| జిల్లు | మిల్లీలీటర్లు (మిలీ) (సుమారుగా) |
|---|---|
| 1 | 142 |
| 2 | 284 |
| 3 | 426 |
| 4 (=1 పింట్) | 568 |

| పింట్లు | లీటర్లు (l) | మిల్లీలీటర్లు (మిలీ) (సుమారుగా) |
|---|---|---|
| 1 | — | 568 |
| 2 (=1 క్వార్టు) | 1 | 136 |

| క్వార్టులు | లీటర్లు | మిల్లీలీటర్లు (మిలీ) (సుమారుగా) |
|---|---|---|
| 1 | 1 | 136 |
| 2 | 2 | 273 |
| 3 | 3 | 409 |
| 4 (=1 గాలన్) | 4 | 546 |

| గాలన్లు | లీటర్లు | మిల్లీలీటర్లు (సుమారుగా) |
|---|---|---|
| 1 | 4 | 550 |
| 2 | 9 | 90 |
| 3 | 13 | 640 |
| 4 | 18 | 180 |
| 5 | 22 | 730 |
| 6 | 27 | 280 |
| 7 | 31 | 820 |
| 8 | 36 | 370 |
| 9 | 40 | 910 |
| 10 | 45 | 460 |

| గాలన్లు | లీటర్లు | మిల్లీలీటర్లు (సుమారుగా) |
|---|---|---|
| 20 | 90 | 900 |
| 30 | 136 | 400 |
| 40 | 181 | 800 |
| 50 | 227 | 300 |
| 60 | 272 | 800 |
| 70 | 318 | 200 |
| 80 | 363 | 700 |
| 90 | 409 | 100 |
| 100 | 454 | 600 |

| మిల్లీలీటర్లు | ద్రవ వ. ఔన్సు (0 25 ద్ర.ఔ సుమారుగా) |
|---|---|
| 10 | 0 25 |
| 20 | 0.75 |
| 30 | 1 |
| 40 | 1.50 |
| 50 | 1 75 |
| 60 | 2 |
| 70 | 2 50 |
| 80 | 2 75 |
| 90 | 3 25 |
| 100 | 3 50 |

| లీటర్లు | గాలన్లు | క్వార్టులు | పింట్లు | జిల్లు (సుమారుగా) |
|---|---|---|---|---|
| 1 | — | — | 1 | 3 |
| 2 | — | 1 | 1 | 2 |
| 3 | — | 2 | 1 | 1 |
| 4 | — | 3 | 1 | — |
| 5 | 1 | — | — | 3 |
| 6 | 1 | 1 | — | 2 |
| 7 | 1 | 2 | — | 1 |
| 8 | 1 | 3 | — | — |
| 9 | 1 | 3 | 1 | 3 |

| మిల్లీలీటర్లు | పింట్లు | జిల్లు | ద్రవ వ. ఔన్సు (0.50 ద్ర.ఔ. సుమారుగా) |
|---|---|---|---|
| 200 | — | 1 | 2 |
| 300 | — | 2 | 0 50 |
| 400 | — | 2 | 4 |
| 500 | — | 3 | 2.50 |
| 600 | — | 4 | 1 |
| 700 | 1 | 0 | 4.50 |
| 800 | 1 | 1 | 3 |
| 900 | 1 | 2 | 1.50 |
| 1000 (=1 లీటరు) | 1 | 3 | — |

| లీటర్లు | గాలన్లు | క్వార్టులు | పింట్లు (సుమారుగా) |
|---|---|---|---|
| 10 | 2 | 1 | — |
| 20 | 4 | 1 | 1 |
| 30 | 6 | 2 | 1 |
| 40 | 8 | 3 | — |
| 50 | 11 | — | — |
| 60 | 13 | 1 | — |
| 70 | 15 | 1 | 1 |
| 80 | 17 | 2 | 1 |
| 90 | 19 | 3 | — |
| 100 | 22 | — | — |

మార్పు మన మంచికే

# మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి — ఎంతో సులభమైనది

భారత ప్రభుత్వం వారిచే జారీచేయబడినది

DA-59/577

ఉస్మాన్‌పురా, కరీంనగరమునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము.
ముద్రణ: ఆంధ్ర ప్రింటింగ్ వర్క్స్. వరంగల్.